

రచయిత

భాషాప్రవీణ, విద్యాప్రవీణ

డాక్టర్ తూములూరు శ్రీదక్షిణామూర్తి శాస్త్రి M.A. Ph.D

## శాస్త్రిగారి ఇతర రచనలు

1. శ్రీ రామకథామృతము - సమగ్ర సమీక్ష
   ఆంధ్రా యూనివర్సిటీ వారిచే Ph.D.
   పొందిన పరిశోధన నిబంధము.
2. రామాయణం-సమాజ దర్పణం 1వ భాగము
3. రామాయణం-సమాజ దర్పణం 2వ భాగము
4. శ్రీరామ వాణి
5. వాల్మీకి వాణి
6. హనుమద్వాణి
7. పావనీ శతకము
8. మహాభారత పారిజాతము (సంకలనము)

   శ్రీలలితాసహస్రనామ వివరణము (అముద్రితము)
9. మాటలంటే మాటలా ?
10. ముసునూరివారి వంశ చరిత్ర
11. తెలుగు వ్యాకరణము
12. భావదేవశతకము
13. శ్రీ వీరాంజనేయ శతకము
14. శ్రీ సత్యనారాయణ శతకము
15. శ్రీ కపోతేశ్వర శతకము
16. శ్రీ రాజరాజేశ్వరీ శతకము
17. శ్రీవిష్ణు సహస్రనామ స్తోత్రము
    ప్రతిపదార్థసహితము

శ్రీ శివాయ గురవే నమ:

శ్రీమాత్రే నమ:

# శ్రీ త్రికూటేశ్వర త్రిశతి



తరణోపాయమునీదునామమదిబాధామగ్నదీనాళికిన్
బరమైశ్వర్యకరంబు, మోక్షదము నీపాదాంబుజధ్యాన, మ
క్షరమౌబ్రహ్మకు, నీకు, నంకితము నాసాహిత్యమర్థిన్గళా
భరణంబైయలరారఁ దాల్పు, మవికల్పా! శ్రీత్రికూటేశ్వరా!



-: ఆశీః పంచమి :-

D శ్రీ త్రికూటేశకారుణ్యపాత్రుఁడవయి
సాధు మేధాబలంబుఁబ్రజ్ఞాధనంబుఁ
బడసి, బుధకవినికర సంభావ్య భవ్య
కీర్తిఁగనుమయ్య! దక్షిణామూర్తిశాస్త్రి! 1

D శ్రీమంతున్, శ్రితలోకబంధుఁ,గరుణాసింధున్, త్రికూటేశ్వర
స్వామిన్, సంస్తుతి చేసి, కాంచితి యశస్సంపత్తి, సర్వజ్ఞు చే
తోమోదంబు ఘటించి, మించిన కవీంద్రున్, సర్వదా సర్వథా
శ్రీ మాత్రంఘ్రి సరోజరాజససముత్సేకంబు నిన్నోముతన్ 2

D మేధాప్రజ్ఞలొసంగుజ్ఞాననిధి, లక్ష్మీ భారతీభామినీ
నాథారాధితపాదపద్ముఁడు,చిదానందుండు, కోటేశ్వరుం
డాధివ్యాధి హరుండు, సత్కవన భాగ్యంబిచ్చె, భావౌచితీ
ప్రాధాన్యాంకితమైన నీస్తుతికృతి ప్రాశస్త్యముంగూర్చుతన్ 3

D శివపూజావిధిచే, మదే భగణముల్ చేకూరు, నీశార్చనన్
జవనాఢ్యంబు తురంగ సంఘము, మనస్సాహిత్యమబ్బున్, సతీ
ధవసేవన్నెలకొందురింటలలనల్, తారుణ్యగణ్యల్, శివా
త్మవిదుక్తంబిది, తాదృశోత్తమసముత్సాహంబు చెందున్నినున్ 4

D దక్షిణామూర్తివీవు, బుధా! త్రికూట
భూధరస్వామి "దక్షిణా మూర్తి"యౌను,
భక్తమౌళి!"సోఽహ"మ్మను పదవిభూతి
సార్థకమొనర్చితివి, స్తుతివ్యాజమునను

-: అభినందన చందనము :-

D కైత పట్టునందు, గట్టిపట్టునుబట్టి
గట్టుపట్టినట్టి, దిట్టవీవు
దక్షతానిధాన! దక్షిణామూర్తివి
దక్షిణాననుండు రక్షగూర్చు

D శతకరచనయందు, ప్రతిభనిరూపించి
ప్రాజ్ఞమణులమెప్పు, పడసినావు
చాలు, రిత్తచెత్తసంపత్తులన్నియు,
మత్తుగొలుపు, జిత్తుసత్తదులుపు

D తాడేపల్లి గురూత్తము
ప్రోడతనము, వాడిచెదని పోడిమిగొలిపెన్
వాడిని నిలిపెను నీహృది
వాడిమిగలపలుకుబడికి, పాదొనరించెన్

D ద్వైతభావముదులిపి, యద్వైతసిద్ధి
గొలిపి, భక్తిప్రపత్తిభాక్కులనొనర్చు
వాక్కుగలిగిన, నీకైత చిక్కదనము
కుదురుకొనుఁగాత, విజ్ఞుల హృదయమందు

D ఆతఁడు త్రికూటనేత, యనంతకీర్తి
థామునొనరించుఁగాత! తత్త్వజ్ఞుఁడౌచు
"దక్షిణామూర్తిశాస్త్రి!" "స్వదక్షిణాస్య
పదము" సార్థకతారీతి, పదయుభాతి

ఇట్లు:
భాషాప్రవీణ, కవిరాజమౌళి–
**చింతలపాటి నరసింహదీక్షితశర్మ**
కోగంటిపాలెం,అగ్రహారము(పో),
అచ్చమ్మపేటమండలము, **గుంటూరుజిల్లా.**

# కవితా కళార్చన

- మల్లాప్రగడ శ్రీ మన్నారాయణమూర్తి

ఆంధ్రదేశంలో గుంటూరుజిల్లాలోని కోటప్పకొండ దివ్యక్షేత్రంలో కొలువు తీరిన స్వామి త్రికూటేశ్వరుడు.

ఇప్పటికీ ఎందరో దేవతలను తన పద్య ప్రవచనాలతో అర్చించిన డా॥ తూములూరు శ్రీదక్షిణామూర్తిశాస్త్రిగారు ఈ పర్యాయం తన ఆరాధనకు లక్ష్యంగా త్రికూటేశ్వరుని ఎంచుకున్నారు.

పరమశివుడు త్రికూటేశ్వరుడై ఈ కవి మనస్సులో ఎలా తిష్ఠవేశాడో ఈ శతకంలోని ప్రతి అక్షరం సాక్ష్యమిస్తుంది.

భారతీయ సంప్రదాయంలో ఎందరో దేవతామూర్తులున్నారు. దేవతలు ఎందరున్నా, దేవుడు ఒక్కడే. ఇదే మన సంప్రదాయంలోని రహస్యం. ఈ రహస్యాన్ని గుర్తించిన ఈ కవి ఏశతకంలో ఏ దైవాన్ని కీర్తించినా, నామ రూపాలకు అతీతమైన ఒక పరతత్త్వ వైభవాన్ని ఆవిష్కరించారు.

దైవం ఏ పేరుతో ఉన్నా, ఏరూపంతో ఉన్నా, ఒకే తత్త్వానికి చెందిన వాడన్న సత్యాన్ని గుర్తించి, తన శతక రచనల ద్వారా సమాజానికి తెలియజేస్తూ, కనువిప్పు కలిగిస్తున్న డా॥ శాస్త్రిగారి అద్వైత దర్శనానికి ఆనందిస్తూ, భక్తి శతక కవిగా సారస్వతలోకంలో ఈ కవికి అజరామరమైన కీర్తి లభించుగాక. అని ఆకాంక్షిస్తూ, ఆ త్రికూటేశ్వరుడు ఈ కవికి అఖండ సంపదలను, అనంత శుభాలను, ఆధ్యాత్మికజ్ఞానాన్ని ఇతోధికంగా ప్రసాదించాలని కోరుకుంటున్నాను.

## శ్రీమాత్రేనమః

శతావధాని
- డాక్టర్. పాలపర్తి శ్యామలానందప్రసాద్ M.A., Ph.D.
విజయవాడ.

సుషమా సుందర సాంధ్యతాండవ నటత్ శోభాభిరామమ్మహో!
విషమాక్షంబసమేషుదాహకకళావిస్ఫోట విన్యాసమున్
ఝషమాలాంచిత జాహ్నవీజటిల భాస్వత్ చంద్రతేజస్తటం
కషమాహాత్మ్యము తూములూరి నుడివెల్గన్ శ్రీత్రికూటేశమౌ

# శతక సామ్రాజ్యంలో మకుటంగల మహారాజు

- రామడుగు వెంకటేశ్వరశర్మ, ఇంటి నెం. : 5-19-9(ఎ), శ్రీకవితాసదనం
శ్రీవెంకటేశ్వర బాలకుటీర్ వద్ద, 2/17 బ్రాడీపేట, గుంటూరు - 522 002
ఫోన్: 0863-2243762, సెల్ : 9866944287

సంస్కృతాంధ్ర సాహిత్యతత్త్వామృతాన్ని పుక్కిటబట్టిన ప్రియసాహిత్య మిత్రులు డా॥ శ్రీతూములూరు శ్రీదక్షిణామూర్తిశాస్త్రిగారు తెలుగుశతక రచనలో అందెవేసినచేయి. అందునా ఉదాత్త భారతీయ సంస్కృతితో గూడిన భక్తి భావసంభరితమైన శతకరచన వీరికి వెన్నతో పెట్టిన విద్య. అది ఇంతింతగా 'పెరుగై' పఠితల(కు) హృదయాలకు చల్లని చల్లగా నిరంతరం తోడ్పడే అక్షరాత్మకమైన చలివేంద్రంగా మారింది– వీరిశతకరచన.

డా॥ శ్రీ దక్షిణామూర్తిశాస్త్రిగారు చాలామంది దేవతలనూ, దేవుళ్లనూ అక్షరమత్తేభాలపై ఊరేగించారు. సువర్ణశాంత శార్దూలాలతో అలంకరించారు తమశతకాల్లో. ప్రకృతం శ్రీత్రికూటేశ్వర శతకంలో గూడా అంతేచేశారు. దీనికి మకుటం – "శ్రీత్రికూటేశ్వరా!" అన్నది–16వ పద్యంలోని "ఈశావాస్యము సర్వమీజగముస్వామీ! శ్రీత్రికూటేశ్వరా!" అన్న చివరిపాదాన్ని చదవగానే ఉదాత్తమైన "ఈశావాస్యమిదంసర్వం" అన్న శ్రుతివాక్యం స్ఫురణకు వచ్చి ఆహార్శించిందంటే నమ్మండి.

"నమకంబున్ బఠియించి, నీదగు ననంతత్వంబు దర్శించుచున్
దమమున్‌బాసి, ప్రబోధమున్‌బడసి, సత్యజ్ఞానసంపన్నుడై
శమితాహంకృతినాత్మ తత్త్వవిదుడై సంతుష్టుడై పొల్చు..." ఇంతవరకు

39వ పద్యాన్ని చదువుతూ చదువుతూ – ఒక్కసారిగా " పూర్ణమునన్ దోచిన పూర్ణుండౌచుంబరిపూర్ణా! " అని చదివిన వెంటనే నాకెంత ఆనందం కలిగిందో మాటల్లో చెప్పలేను. ఎందుకంటే – "పూర్ణమద: పూర్ణమిదం పూర్ణాత్ పూర్ణముదచ్యతే, పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే" అన్న పూర్ణ తత్త్వమంత్రాన్ని గుర్తుచేసినందుకు – తదనుకూలంగా ఆ పరమాత్మను ఇక్కడ " పరిపూర్ణా " అని సంబోధించినందుకు – ఇటువంటి ఉదాత్త భారతీయ

భావసంస్కృతిని గుర్తు చేయడమే కాదు – వేద తత్త్వనిర్వచనాన్నీ, ఆ వేదాలకూ – పరమాత్మకూ ఉండే అనుబంధాన్నీ " వేదం బాపరతత్త్వ బోధకలనావిష్కార సంపన్న మావేదంబే శివ! నీదు నిశ్వసితమై వేద్యంబు, నీ రూపుగా! వేదార్థంబు గ్రహింప సత్యముగ నీ విశ్వంబు నీవౌట సమ్మోదంబావహిలన్ దలంతుననిశంబున్ శ్రీత్రికూటేశ్వరా! అన్న 50వ పద్యంలో ఎంత సూటిగా తేటగా చెప్పారండీ! శాస్త్రిగారు–

దక్షప్రజాపతి గర్వాన్ని అణచి, తపస్సుచే శాంతితో దక్షిణామూర్తియే అయిన ఈశ్వరుని గురించి అక్షర రమ్యంగా మా దక్షిణామూర్తిశాస్త్రిగారు రచించిన "నెపమున్ మోపి, విరోధమున్ నెఱపి, దుర్నీతిన్ బ్రవర్తించుచున్" 22వ పద్యంలోని మొదటి పాదాన్ని చదివిన తర్వాత "విపరీత ప్రతిభాష లాడుచు.. "అన్న రెండవ పాదాన్ని చదువుతున్నానండీ! అంతే – ఒక్కసారిగా నాకు ఎంత ఆనందం కలిగించిందో చెప్పలేను – ఎందుకనుకుంటున్నారు? – "విపరీతప్రతిభాషలేమిటికి నుర్వీనాథ!"అన్న నన్నయ భారతంలోని శకుంతలోపాఖ్యానంలోని పద్యం ఎత్తుగడను గుర్తుచేసినందుకు – మరోచోట అంటే 31వ పద్యంలో చివరి పాదమైన "నా జననంబున్ సఫలంబు చేయవె! మహేశా!.. అని చదివానో లేదో – వెంటనే నాకేమనిపించిందో చెప్పమంటారా? " నా జననంబున్ సఫలంబు చేసెద – పునర్జన్మంబు లేకుండగన్" అన్న తెలుగులపుణ్యపేటి అయిన పోతన్నగారితో పోటీ పడుతున్నారా? అని. నిజంగా అంతటి అర్హతను సంపాదించుకున్న వారే–మా దక్షిణామూర్తిశాస్త్రి గారు. ఇంక ఈశతకంలో వేరే ప్రత్యేకంగా చెప్పేదేముంది?

"ఏ వేదంబుఁ బఠింపలేదు, తమితో నేశాస్త్రముల్ జూడలే
దేవిద్యాభ్యసనంబొనర్ప ననయంబే మంత్రమూహింప, బో
ధావిర్భావ నిధానమైన పదముల్ ధ్యానింతు సంపూర్ణ యో
గావష్టంభ సుఖానుభూతినిడుమయ్యా! శ్రీత్రికూటేశ్వరా!"

అన్న 37వ పద్యం చదవగానే – మీకు తెలుసుగదా! – ధూర్జటి మహాకవి శ్రీకాళహస్తీశ్వర శతకంలో ని "ఏ వేదంబు పఠించెలూత? భుజగంబే శాస్త్రముల్ చూచె... నన్న పద్యం గుర్తుకు రాకుండా వుంటుందా? అలాగే ధూర్జటి తన శతకంలో చెప్పిన తన భక్తి కవితా లక్షణాల భావాన్నే "రసవత్ కావ్య ఫలంబుఁ జూరగొన,నౌరాయంచుఁ గీర్తింప..." అన్న 64వ పద్యంలో చక్కగా తీసుకువచ్చారు.. దక్షిణామూర్తిశాస్త్రిగారు.

తనువున్ దస్సి, కఫంబు, వాతగతి పిత్తంబున్ బ్రకోపించి, పొ
మ్మనియూ,రింకిట రమ్మటంచచటి వారాదేశముల్ బంపగా
నిను భక్తిన్ దలపోయు యోగమదిసందేహంబుగానన్ మహా
త్ముని వేదప్రతిపాద్యు నేడె మది నెంతున్; శ్రీత్రికూటేశ్వరా!"

అన్న 74వ పద్యభావం చదవగానే "ముప్పునఁ గాలకింకరులు ముంగిట వచ్చినవేళ...

అన్న కంచెర్ల గోపన్న దాశరథీ శతక పద్యం తలపులలోనికి రాకుండా ఉంటుందా? అయితే ఇలా పూర్వ కవుల పద్యాలూ, భావాలూ గుర్తు చేయడమేనా? ఈయనదిఅంటూ స్వతంత్ర రచనాముద్ర ఏదైనా ఉందా? అంటే ఉందండోయ్! ఈ పద్యంలోనే "ఊరు పొమ్మంటోంది – కాడు రమ్మంటోంది" అన్న తెలుగు సామెత భావాన్ని సమకూర్చారు. – ఈకవి మరీ "కాడు" శబ్దాన్ని ప్రత్యక్షంగా ఉపయోగిస్తే బాగుండదు గదా! "అచటివారు రమ్మని ఆదేశాలను పంపగా" అని ఔచిత్యసహితంగా అన్నారు – ఈ కవి – గమనించారా?

అంతేకాదు – "చెవిలో నెప్పుడు గూడు కట్టుకొని యశ్లీలంబులన్ జెప్ప విందురు'' అన్న 93వ పద్య ప్రారంభంలోనే తెలుగు నుడికారం వినిపించడంలేదూ? – ఈ పద్యంలోనే "కల్లబొల్లి కబురుల్" అన్న తెలుగు వ్యావహారిక నుడికారాన్ని గూడా వాడారు. ఇలా ఈయన రచనా వ్యక్తిత్వ ముద్ర భద్రంగా కనిపిస్తుందండోయ్! "ప్రబుద్ధులు" అనే పదానికి నేటి

తెలుగు వాడకంలో ఉన్న అర్థం వేరు. మందమతులు – ఎందుకూ పనికిరానివారూ అని నిందగా, అధిక్షేపణగా వాడుతూ ఉంటాం. కాని ఈకవి ఆపదాన్ని ఆ వ్యవహారార్థంలోకాక ప్రకృష్టమైన బుద్ధులు అనే సహజార్థంలో 61వ పద్యంలో "ఎవరేరీతి ప్రబుద్ధులంది ఘనులైరి.." అని వాడారు. అది మనం గమనించాలి. మరో అంశమండోయ్! ఆ 61వ పద్యంలోనే "భవదంశ సంజనిత తేజఃపుంజముల్" ..." " ధర్మ ప్రతిష్ఠామహోత్సవ నిర్వాహక బృందముల్ " అన్న సంస్కృత సమాసరచన చూడండి. ఎంత దర్జాగా సొగసులు పోయిందో! అసలు – ముక్కంటిని 62వ పద్యంలో "తిగకంటీ!" అని జ్ఞాన నేత్రం కలవాడా! అన్న అర్థంలో అచ్చతెలుగులో సంబోధించడం అనేది ఎంత ముచ్చటగా ఉందో!

ఇంకా ఇందులో నన్ను ప్రధానంగా ఆకర్షించింది – మకుటానికి ముందు ఈశ్వరుడికి ప్రయోగించిన సంబోధనాత్మక విశేషణాలు. ఇవి చాలా సార్థకంగా, సాభిప్రాయసుందరంగా ఉన్నాయి. ఆయా పద్యాలలోని భావౌచిత్యాన్ని పట్టి చూపిస్తున్నట్లుగా ఉన్నాయి. మచ్చుకి 94వ పద్యం చూడండి: –"ధనదుండాశ్రితుఁడాప్త బంధువు మహోదారుండు శ్రీనాథుఁడా

ర్తి నివారించుచు సర్వకార్యములు నిర్విఘ్నంబుఁగాగన్ సురా
ళినిఁగాపాడెడు నాయకుల్ సుతులు, తల్లీలా వినోదంబులన్
దనియించున్ జగమెల్ల నీ సతి; సమర్థా! శ్రీ త్రికూటేశ్వరా!"

కుబేరుడంతటివాడు శివునికాశ్రితుడు. శ్రీనాథుడు ఆప్తబంధువు. ఆర్తిని నివారిస్తూ సర్వకార్యాలూ నిర్విఘ్నంగా జరిగేలా ఆయన సుతులు (సేనాపతి, గణపతి) సురాళిని కాపాడుతుంటారు. తనలీలావినోదాలతో జగతినెల్లా ఆయన సతి సంతృప్తి పరుస్తూ ఉంటుంది. దీనికంతటికీ కారణం–శివుని సామర్థ్యమే. కాబట్టే "సమర్థా!" అన్న సంబోధనం ఈశ్వరుడికి ఇక్కడ సాభిప్రాయం – సార్థకం. అలాగే "మౌనీ!, శాంతా! త్ర్యక్షా! ఇత్యాది సంబోధనలు గూడా కానవస్తాయి. మనకు ఆనందాన్ని కలిగిస్తాయి. 5వ పద్యంలో హరుణ్ణి "విశ్వేశ్వరుడు" అని నిరూపించిన తీరుగూడా బాగుంది. ఇంకా ఆనందాన్ని కలిగించే మరో అంశాన్ని చెప్పమంటారా? ఈశ్వరుని నుండి తాము "భవత్పాదంబులే చాలు" ననీ, నీ సాన్నిధ్యమే చాలు" ననీ, నీ సౌజన్యమే చాలు" ననీ మూడు పాదాల్లో ముచ్చటగా కోరుకుంటూ ఆ పదాలనే 17వ పద్యంలో ప్రయోగించి ఈ కవి – యతీశ్వరులైనారు. అంతే కాదు. చిన్ముద్ర, మౌనముద్ర, యోగముద్ర కలిగిన సంయమవరేణ్యునిగా ఆ శివపరమాత్మను 53వ పద్యంలో అందుకే సంబోధించగలిగారు. ఈశ్వరుని సత్యం జ్ఞానమనంతమైన బ్రహ్మగా పేర్కొంటూ, "జ్ఞేయా" అని కూడా సంబోధించారు. "భర్గోదేవస్య ధీమహి" గా ఈశ్వరుని 88వ పద్యంలో సంభావించారు. "పాపోహం, పాపకర్మాణం" అంటూ మన్యు సంతాపాన్ని శమింపజేయమని 97వ పద్యంలో ఆ సద్యోజాతుని ప్రార్థించారు. దక్షుని కథతోపాటు మరోచోట భక్త మార్కండేయ కథను చెప్పారు. ఇంకోచోట – జితరాగా! సుఖమేనా? అని ఈశ్వరుణ్ణి ప్రశ్నించడంలో చమత్కారం చేశారు. – దుర్జనుని లక్షణాలను చెప్పారు – అలా ప్రవర్తించవద్దు అన్నట్లుగా 59వ పద్యంలో

"తనువున్, బ్రాణము, జ్ఞానమున్ బడసి, తత్కారణంబౌ ఋణం
బును దీర్పన్ నరజన్మ సార్థకమగున్; బుణ్యంబు వర్ధిల్లఁదా
మనమున్ వాక్కును కర్మమున్ సమముగా మర్యాదలన్ బూనుచున్
మనఁగా, నప్పురుషార్థముల్ కలుగు; సమ్మాన్యా; త్రికూటేశ్వరా!"

అని పఠితలకు సందేశాత్మకంగా చెప్పారు. 113వ పద్యంలో "...రాగద్వేషములను జయించి, ముదమారన్ శ్వాసలే డోలలై తూగాడన్ గల ధ్యానమేనభిలషింతు" నని తమ కోరికను అభివ్యక్తీకరించారు. చివరి 120వ పద్యంలో అపవర్గానుభవాన్ని వ్యంగ్యంగా ఆకాంక్షించడం

ఔచిత్యమహితం. ఇలా ఎన్నని చెప్పను – విశేషాలు? – చెప్పాలంటే ఇంకా చాలా వున్నాయి. 5వ పద్యంలో ఈకవి ఈశ్వరుని "సుకృతీ!" అని సంబోధించారు. అది ఈ కవీశ్వరునికే సమన్వయించవచ్చు. 119వ పద్యంలో "శివమౌనీకృతులెల్ల సర్వ భువన క్షేమంకరంబై ప్రసిద్ధి వహించున్ నిగమాగమ ప్రణుతమై" అని అన్నారు ఈకవి. ఈ లక్షణం ఈ శతకంతోపాటు వీరి శతక రచనలకన్నిటికీ వర్తిస్తుంది. కిం బహునా? ఆ మేధా దక్షిణామూర్తి గురించి ఈ శ్రీదక్షిణామూర్తిశాస్త్రిగారే శాస్త్రీయంగా చెప్పగలరు. అలా తమ పేరును గూడా సార్థకం చేసుకున్నారు. భవిష్యత్తులో గూడా ఇలాగే ధారాశుద్ధి గలిగిన పద్య సువర్ణ మకుటాలతో తెలుగు భక్తి శతక సామ్రాజ్యాన్ని ఏలుతూ, మా ప్రియమిత్రులు మకుటం గలిగిన మహారాజుగా వెలుగొందాలని ఆ పరమాత్మను హృదయపూర్వకంగా కోరుకుంటున్నాను. ఇప్పటికే పాఠకులూ! మీకూ, శతకానికీ 5పేజీలుగా అడ్డుగా నేను ఉన్నందుకు మన్నించమని వేడుకుంటూ... సెలవు... రామడుగు వెంకటేశ్వర శర్మ.

**-: కృతి – సుకృతి :-**

D **శ్రీ "త్రికూటేశ్వరస్తవత్రిశతి" భక్తి**
**శతకశతసహస్రములలో నుతికి నెక్కెc;**
**గవి స్వహృదయరసాభిషేకకృతి శివుని c**
**గృతిపతిని c జేసి సుకృతియుcగృతియు నగుట.**

D **పలుకుంబోడి మెఱుంగుcజెక్కిళుల శోభన్ గెల్చు తళ్కుల్ పదం**
**బులcబొల్పార వియన్నదీరససుధాపూరంబు వారించు ని**
**ర్మలభావంబు లవేలమై వెలయ ధారాశుద్ధిమత్పద్యపూ**
**జల cగొల్చెన్ శివుc దూములూరి కవి పెల్చన్ దక్షిణామూర్తి దాన్.**

**భారతం శ్రీమన్నారాయణమూర్తి**

**శ్రీ మహాగణాధిపతయే నమః**

## శ్రీ త్రికూటేశ్వర శతకము - నా అనుభూతి.

**ఆచార్య యార్లగడ్డ బాలగంగాధరరావు**
13-8/1, కృష్ణనగర్-విజయవాడ-520007
9849499169; 0866-2551177.

తెనుగు సాహిత్య ప్రియులకు ముందుగా నమస్కారము. ఆ వెంట విజ్ఞప్తి. కారణమేమంటే... మీకు ఇక్కడ మరో విందు సిద్ధమై వుంది. ఆ విందు గ్రహించటానికి ఇక మీదే ఆలస్యం. అది డా॥ శ్రీయుత తూములూరు శ్రీదక్షిణామూర్తిగారిచే సిద్ధం చేయబడింది. తాము భక్తిపరులైతే ఇక చెప్పేదేముంది!

ఒక శతకాన్ని పరిచయం చేయటానికి, సహ పాఠకునిగా అనుభూతిని వ్యక్తం చేయటానికి – ఇలా ప్రారంభించాలా – అని అనిపిస్తోంది గదూ! కావచ్చు. కాని నా మార్గం అంతే! ఇక నా యీ శతక పఠనానుభవాన్ని వ్యక్తం చేసే ప్రయత్నం చేస్తాను.

దానికి ముందుగా మరో ఒకటి రెండు మాటలు మనవి చేయాల్సి వుంది. ఒక మధ్యాహ్నం నాకు ఈ శతక ప్రతి అందింది. కనీసంగా శ్రీశాస్త్రిగారు ముందుగా ఒక్కమాటైనా అన్నారు కాదు. అలా వారు ముందుగా హెచ్చరిక చేసి వుంటే – నేనీ పనికి ఒప్పుకోకపోయి వుందును.

కారణమేమంటే – శ్రీశాస్త్రిగారు ఇప్పటికే ఎన్నో రచనలు పాఠకులకు అందించారు. వారు రచించిన పూర్వపు శతకాలు నేను చదివాను కూడా! అలాంటి లబ్ధప్రతిష్ఠులను ఇప్పటికిప్పుడు నేనుగా పరిచయం చేయవలసిన పనేముంది గనుక! మొదలు అలాంటి పని చేయటానికి నాకుగల యోగ్యత ఏపాటిది! నా పరిమితులు నాకు తెలియవు గనుకనా! ఆ మాటే వారితో అంటే కాదు, కూడదన్నారు. ఇక అది తప్పించుకోలేని అనురోధం! చదివి

ఆనందించటం వేరు! అభిప్రాయం చెప్పటం వేరు! అందునా అర్హత చాలనప్పుడు! తప్పకనే ఈ పనికి పూనుకోవలసి వచ్చింది. నాపై శ్రీశాస్త్రిగారు వుంచిన గౌరవాభిమానాలకు ఏటికోళ్ళెత్తుతూ, ఈ నాలుగు మాటలూ వ్రాస్తున్నాను. ముందే మనవి చేసినట్లుగా శ్రీశాస్త్రిగారు ఎన్నో రచనలు చేశారు. అందులో శతకాలూవున్నాయి. కొన్నింటిని చదివానని ముందే మనవి చేశాను గదా! శతక రచన, కావ్యరచనలో చేయి తిరగటానికి ముందుగా చేసే వాఙ్మయాభ్యసనమని చెపుతారు. అది నిజమే కావచ్చును! కాని అదే సమయంలో అనుకోవాల్సిన మరోమాట కూడా వుంది. అదేమంటే ఆ వ్యవసాయంలో తలపండిన, చేయితిరిగిన వారు చేసే రచన కూడా అని. నిరంతరం వాఙ్మయానుశీలన, చుట్టూ వున్న సంఘాన్ని అంత నిశితంగాను పరిశీలించటం, జీవితానుభవం – వీటి అన్నింటి వలన కలిగిన మానసిక వికాసం, తోడు జీవుని వేదన – వీటి అన్నింటి రంగరింపు శతకరూపంలో వెలువడుతుందని నాభావన. అపుడే సృష్టికర్తలో ముఖాముఖి సంభాషించగల సత్తా కలుగుతుంది. ఈ సత్తా ఏర్పడటానికి, హృదయనైర్మల్యం, సకల జీవుల వర్తనం, అందలి బాగోగుల పట్ల సమదృష్టి, సమవర్తిత్వం – అంటే ఉపేక్షతో కూడిన అపేక్ష, దీనినుండి ఏర్పడిన ఒకా నొక చిత్త సంస్కారం, మరోవైపు ఆర్తి – ఇవన్నీ శతక రచనకు కారణాలవుతాయి. కనుకనే పాఠకుడు అందులో తనను తాను చూసుకుంటాడు. అంటే, తాననుకుంటున్నది, అశక్తత కారణంగా తాను వ్యక్తం చేయలేనిదీ, అనుభూతిలోనికి వచ్చి అది ఆత్మీయంగా భాసిస్తుంది. అందువల్లనే శతకాలకు అంత ప్రాచుర్యం, మిగిలిన వాఙ్మయ ప్రక్రియలకంటే అధికంగా ఏర్పడటానికి కారణం. అదిగో ఆ లక్షణాలన్నీ పట్టిన శతకమిది. చదివిన తరువాత పాఠకులు నా అభిప్రాయాన్ని తప్పక ఔనంటారనే నేను విశ్వసిస్తున్నాను.

సరే! శతకంలోని అన్నింటినీ పరామర్శించటం అనవసరపు ప్రయత్నం. కారణం, రచన ఎలాగూ మీచేతిలో వుంది. చేతికంటూ అందివచ్చిన తరువాత ఎలాగూ చదవకుండా వుండలేరుగదా! శ్రీ శాస్త్రిగారు గావించిన సాహిత్యానుశీలనం, శాస్త్రానుశీలనం, పురాణ ఆగమాలతో వారికి గల పరిచయం శతక మంతటా పరుచుకుంది. పూర్ణమిదం పూర్ణమ్, అణోరణీయాన్ మహతో మహీయాన్, సర్వంబ్రహ్మమయం, జగత్సర్వం ఈశావాస్యం అన్న విశేష సూక్తులకు వ్యాఖ్యానమూ కనపడుతుంది. తనగతికి స్వకృతమే తప్ప మరేదీ కారణం కాదన్నమాటా కనిపిస్తుంది. పద్యాలకు పద్యాలు అన్నీ ఉదహరింపదగ్గవే. నన్ను అన్నీ ఆకర్షించాయి. మరీ ముఖ్యంగా 77వ పద్యం, 81వ పద్యం నన్నెంతగానో మురిపించాయి. 81వ పద్యంలో మౌన ప్రాశస్త్యాన్ని చెపుతూ, అది శబ్దమయ కాలుష్యాన్ని వారిస్తుంది. అన్నమాట ఎంత విలువైనది. యోచించటం వేరు. సంయోజిస్తే అందివస్తుంది – ఆ అమృతమయ తత్త్వం! 83వ పద్యంలో కవిత్వాన్ని గూర్చి వివేచిస్తూ – కవిత్వకళ, ఈశ్వరుని కళానివహమంటూ, అదే ఈశ్వరుని స్వరూపమని నిష్కర్ష చేసిన తీరు ఎంతో బాగుంది. ఇలా మొత్తాన్ని వివేచించటం, ముందే చెప్పినట్లు, సాధ్యమూ గాదు, అనవసరం కూడా! అది అలా వుంచితే – రచనా పరంగా, అంటే భాషా పరంగా కూడా నాకు ఎంతో ఆనందాన్ని కలిగించింది ఈ శతకం. అర్ధబిందువులు, శకటరేఫలు పాటించారు. ఇవి అవసరమా అంటున్నారు ఈనాడు. కొందరైతే అనవసరమని కూడా అన్నారు. కాని నేను అవసరమనే అంటాను. కారణం ఇది సాహిత్య ప్రక్రియలో భాగం కనుక! వార్తా పత్రికో, సాధారణ ప్రసంగమో, వస్తు వైశిష్ట్యాన్ని వివరించే కరపత్రం కాదు గనుక! సరే, దానినలా వుంచితే – సరళాదేశ సంబంధులూ, డుమంత శబ్ద సంబంధులూ అయిన పదాల విషయంలో బిందువు, అర్ధబిందువులను (సున్నాలు, అరసున్నాలు కావు సుమా) పాటించడం ఒకపాటి పండితులందరూ పాటించేవే. అవిగాక

శబ్దగతమైనవి, అంటే నిసర్గంగా బిందుయుతమైన వానిని పాటించడం – ఇటీవలి కాలంలో కనపడటంలేదు. మరి వాటి అవసరమూ వుంది. శ్రీ శాస్త్రిగారు వాటినీ పాటించారు. అది నాకెంతో ముచ్చటగొలిపింది. భాషావేత్తలను తప్పక ఇది అలరిస్తుంది. ఇక సంస్కృత శబ్దాల విషయంలో ప్రకృత రూపాలను (శాన్తము మున్నగునవి) కోరి ఉపయోగించారు. సంస్కృతం బాగా నేర్చిన వారే గనుక, ప్రత్యేకించి ఆ విన్యాసాన్ని గూర్చి వారిని అగ్గించవలసిన అవసరం లేదు, కాని తెనుగు పదాల విషయంలో కూడా (అన్చున్, 55వ పద్యం బిందువిరహితంగా ప్రయోగించారు. బిందు సహితంగా అయితే అది ' అంచున్ ' అని వుంటుంది. అలా ప్రయోగించటమూ కనిపిస్తుంది. కాని దానివలన ' అనుచున్ ' అనే ప్రస్తుత రూపం స్ఫురింపకపోయే ప్రమాదముంది. మరొక ఇబ్బంది, అక్కడ బిందువుంటే, అది తాలవ్యానునాసికంగా భాసించే అవకాశముంది. ఇలాంటి సందర్భాల్లో అంటే వర్గానునాసిక్య విషయంలో సందిగ్ధానికి గురి చేసే సందర్భాల్లో ప్రస్తుత రూపాన్నే వ్రాయటం మేలు. ఇలాంటిదే వీరి రచనలో మరోచోట కూడా సముచితంగా చోటు చేసుకుంది. నన్నయ దీనినే పాటించారు. ఇది రచయితకు గల శబ్దాధికారాన్ని, ధ్వని విషయంలోగల జాగరూకతను పట్టి ఇస్తుంది. అంతేకాదు. ఇటీవల రచనలో కొన్ని పదాలను పాతవడ్డ పదాలుగా భావించి ఉపయోగించటం లేదు. కాని ఏ పదానికి మరోపదం ప్రత్యామ్నాయం కాదు, కాజాలదు. శ్రీశాస్త్రిగారు 25వ పద్యంలో ' పొదలు ' శబ్దాన్ని సందర్భసహితంగా ప్రయోగించారు. అక్కడ మరో శబ్ద ప్రయోగం అతకదు గాక అతకదు. అదీ శబ్దాధికారమంటే. అలా కూడా ఈ రచన నన్ను ఆకర్షించింది.ఈ రెండు విధాలా ఇటు భక్త జనులకు, అటు భాషార్చకులకు సంతృప్తి నిచ్చే రచన. శ్రీశాస్త్రిగారు అర్చించిన త్రికూటేశ్వరస్వామి ఎవరనే సందేహం ఈ ప్రాంతవాసులకు కలిగే అవకాశముంది. ఆ స్వామి కోటప్పకొండ, (నరసరావుపేట సమీపం) పై గల అధిష్ఠానదైవం. గుంటూరు, ప్రకాశం జిల్లాల వారికి కోటప్పకొండ తిరునాళ్ళు (మహాశివరాత్రి) అత్యంత ప్రియమైనవి. ప్రజలు భక్తి ప్రపత్తులతో నిర్మించి ఆ తిరునాళ్ళకు తరలించి తెచ్చే ప్రభలు వాటికవే సాటి. ఆ సందర్భంగా ఎడ్ల ప్రదర్శన పోటీలు కూడ జరుగుతాయి. లక్షలాదిగా జనం ఆ స్వామిని దర్శించి తరిస్తారు. గతంలో ఎన్నో పాలకవంశాలకు త్రికూటేశ్వరస్వామి ఆరాధ్యదైవం, ఇలవేల్పు. దూరానికి ఆ కొండ మూడు శిఖరాలతో దర్శనమిస్తుంది. అందువలన ఆ కొండకు త్రికూటమని పేరు.

శ్రీ శాస్త్రిగారు ఈ శతకాన్ని సంతరించి ఆ దేవునికి తమ ఆర్తిని నివేదించారు. శతకరూప గ్రంథంగా వెలువరించి అశేష భక్తజనులు తమ ఆర్తిని ఆ స్వామికి విన్నవించుకుని తరించే మార్గాన్ని చూపారు. దానికిగాను వారు అభినందనీయులు. అలా మన కృతజ్ఞతకు పాత్రులైనారు. ఆ త్రికూటేశ్వరస్వామి వారిపైనా, పఠితలపైనా తన కృపాకటాక్షవీక్షణాలను ప్రసరింపచేయు గాక.

ఈ నాలుగు మాటలు వ్రాయటానికి కారణం, వారికి నాపైగల గౌరవాభిమానాలు. ఇలా ఈ అవకాశాన్ని కల్పించిన శ్రీ శాస్త్రిగారికి కృతజ్ఞతాంజలి ఘటిస్తూ –

ఇట్లు
బ్రాహ్మణ దాసుడు,
యార్లగడ్డ బాలగంగాధరరావు
ది. 10.04.10

### శ్రీ శివాయ గురవే నమః

ఆచార్య సార్వభౌమ, 13.9.2010.
ప్రొఫెసర్ వేదుల సుబ్రహ్మణ్యశాస్త్రి,
ఎం.ఎ..పి.హెచ్.డి. (తెలుగు) ఎం.ఎ., పి.హెచ్.డి. (సంస్కృతం)
శారదాపీఠం, 46-15-35, మండావారిపేట,
దొండపర్తి, విశాఖపట్నం.530016.

## ఆప్త వాక్యం

తెలుగు సాహిత్యంలోని శతకప్రక్రియ పన్నెండవ శతాబ్దిలో ఆవిర్భవించినప్పటికీ నేటికిగూడ బహుముఖంగా ప్రవర్ధమానమౌతోంది. విద్వత్ప్రంశలు అందుకొంటోంది.

శతం శతకం అనే రెండూ సమానార్ధకాలు. వంద అని అర్ధం. ముక్తక ప్రాయాలైన వంద పద్యాల రచన శతకమనిపించుకొంటుంది. నూరు అనే సంఖ్య ఉపలక్షణం మాత్రమే. కొంచెం ఎక్కువగానే పద్యాలు ఉండడం విశేషం. తెలుగులోని శతకరచనకి సంస్కృత శతక రచనమే మూదల. కాని మకుట సంప్రదాయంవంటి కొన్ని విశిష్టలక్షణాలు తెలుగు శతకకవులు పాటించేరు. ప్రాచీన శతకాలు సామాన్యంగా భక్తి జ్ఞాన వైరాగ్య నీతిబోధకంగా రచింపబడ్డాయి. ఆధునిక శతకాలు సామాజిక స్పృహ ప్రధానంగా సంతరింపబడుతున్నాయి.

శ్రీ ॥ డా ॥ తూములూరు శ్రీదక్షిణామూర్తిశాస్త్రిగారు ప్రాచ్యకళాశాలలో ఇంచుమించు గురుకుల పద్ధతిలో సంస్కృతాంధ్ర సాహిత్యాలని అభ్యసించారు. నిర్మల ధర్మ కర్మ నిష్ఠాగరిష్ఠులు. ఇతఃపూర్వం పెక్కు శతకాలనీ, విమర్శగ్రంథాలనీ రచించినవారు.

శతకం ఆత్మాశ్రయకవితా మార్గానికి ఆదర్శమనదగ్గది. కవి యొక్క ఆంతరంగికమైన అనుభవాన్ని ఆవిష్కరించడానికి శతకం అనుగుణమైన రచనమవుతుంది. హృదయదఘ్నమైన తన ఆర్తిని కవి భగవంతునికి నివేదించుకోడానికి శతకం ప్రధాన సాధనమనదగ్గది. పాఠకులని భక్తి తత్పరులుగా నైతిక సంస్కారసంపన్నులుగా తీర్చిదిద్దడానికి శతకం ప్రముఖమైన రచనగా ప్రసిద్ధి పొందింది. శ్రీ దక్షిణామూర్తిశాస్త్రిగారు భక్తి భావ బంధురంగా ప్రాచీన మహాకవుల పద్ధతిలో నేడు శ్రీత్రికూటేశ్వర శతకాన్ని రచించడం అస్మదాదులకు పరమహర్షదాయకం.

నటరాజశేఖరుడైన పరమేశ్వరవైభవాన్ని "భువనంబాంగిక మెల్ల వాఙ్మయము నిర్బోధించు విజ్ఞాన వైభవము.." అని వర్ణిస్తూ గ్రంథం ఆరంభింపబడింది. సర్వ వాగ్వికారం పరబ్రహ్మతత్త్వైక బోధకం. భక్తపాలన కళాతంత్రం పరమేశ్వరుని విలాసం. అని తత్త్వోపదేశంతో శతకం శుభారంభమైనది. ఈశ్వర చైతన్యం సర్వవిశ్వవ్యాపకమైనదనే సత్యాన్ని శ్రీశాస్త్రిగారు చక్కగా "గిరులందున్ దరులందు.... అనే రెండవ పద్యంలో నిరూపించారు.

హృదయంలో పొంగి పొరలుతున్న భక్తిభావావేశాన్ని కవిగారు ఒక్కపొల్లుమాట ప్రయోగించకుండా ప్రాచీనమహాకవిమార్గంలో "మునిమూర్ధన్యులు మాన్యులాదృతి తపః పూతాత్ములై" .... (20)" అనే పద్యాన్ని రచించడం ప్రశంసార్హం. ఈశ్వరతత్త్వాన్ని అలతి అలతి తునియల కాహల సంధించినరీతి చిన్నచిన్న సంస్కృత సమాసాలతో పరమ శ్రావ్య రమణీయమైన శైలిలో "సకలాధారము శాంతరూపము తపస్సంవేద్య మధ్యాత్మసాధకము.." (57)అనే పద్యాన్ని కవిగారు రచించి కృతార్థులైనారు. పరమేశ్వరుని అర్చింపవలసిన పద్ధతిని శ్రీశాస్త్రిగారు "నినుభావించుచు నీదు లీలలభివర్ణింపన్.. (80)" అనే పద్యంలో చక్కగా ఉపదేశించారు.

"అపరాధంబు లహర్నిశల్ సలుపునాయజ్ఞానమున్ ద్రోచి సత్కృప మన్నింపవె దాసునిన్ మనుపవే " (120) అనే విన్నపంతో గ్రంథం సమాప్తమైనది.

ఈ శతకంలో అడుగడుగునా పూర్వరచనానుసరణం ప్రస్ఫుటమౌతూ ఉంటుంది. సర్వైశ్చవేదైరహమేవ వేద్యః అనే గీతోక్తి "వివిధంబౌ శ్రుతివాక్యసంచయములన్ వేద్యంబు బ్రహ్మంబు (8) " అని తెనిగించబడింది. గురోర్నాస్తి పరం దైవమ్ అనే సూక్తికి "గురు పాదాంబుజసేవనంబు ..(4) అనే పద్యం వివరణప్రాయం. ఈశావాస్యమిదం జగత్.. అనే ఉపనిషద్వాణి "ఈశావాస్యము సర్వమీ జగము అని, జాగ్రత్ స్వప్న సుషుప్తిషు యాసంవిదుజ్జ్రుంభతే అనే శంకరవాక్కు జాగత్ స్వప్నసుషుప్తులంబొదలు".. (25) అని భద్రం కర్ణేభిఃశృణుయామ దేవాః అనే శాంతిమంత్రం కనులన్ భద్రములైనవాని గనంగర్ణంబుల్ భద్రముల్ "... (18) అని చక్కగా పద్య బద్ధమైనవి. ఏ వేదంబు పఠించె లూత" ధూర్జటి వాక్యాన్ని "ఏ వేదంబు పఠింపలేదు తమితో నేశాస్త్రముల్ జూడలేదేవిద్యాభ్యసనంబొనర్ప ననయంబే మంత్రమూహింపబోను" (37) అనే పద్యం జ్ఞాపకంగా కవిగారు రచించేరు. "కవితల్ వ్రాయుట నేరమౌననుట" (83) అనే పద్యం 'కావ్యాలా పాంశ్చవర్జయేత్' అనే వాక్యపరమార్ధ నిరూపకం. పాపాత్మా పాపసంభవః అనే ప్రార్ధనోక్తులు పాపాత్ముండను పాపసంభవుడ(97) అనే పద్యంలో అనువదింపబడ్డాయి. 'అహం బ్రహ్మాస్మి అనే వాక్యం "నేనె బ్రహ్మ" అని చక్కగా పేర్కొబడింది. పద్యరచన ధారాశుద్ధితో హృద్యానవద్యంగా, సుమనోమనోహరంగా ప్రతి పద సార్ధకంగా ఝడిత్యర్ధ బోధకంగా విద్వత్ప్రశంసాపాత్రంగా సాగింది. శరదిందు ప్రభ, వసంత సుమనస్సౌరభ్య సారంబు, నిర్ధూతాత్మపాపౌఘులు, పరతత్వ బోధకలనావిష్కార సంపన్నము, ధర్మప్రతిష్ఠామహోత్సవ నిర్వాహక బృందముల్, మొదలైన సంస్కృత సమాసాలు అలవోకగా ప్రయోగింపబడ్డాయి. శతకానికి తుష్టిని పుష్టిని చేకూరుస్తున్నాయి.

అక్కడక్కడ లోకవృత్త చిత్రణ గావిస్తూ భక్తి భావైక మధురంగా త్రికూటేశ్వర శతకాన్ని రచించిన శ్రీ డా॥ తూములూరు శ్రీదక్షిణామూర్తి శాస్త్రిగారిని హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను. ఇతోధికంగా వారి సాహిత్య వరివస్య వర్ధిల్లాలని ఆశీర్వదిస్తున్నాను.

శుభం భూయాత్

శారదా పీఠాధివాసి

**వేదుల సుబ్రహ్మణ్యశాస్త్రి.**

## కృతజ్ఞతలు

ఈ నా లఘుకృతిని, త్రిశతిని పరిశీలించి, సవరించిన పండిత వరేణ్యులందఱకు పేరుపేరున నాహృదయపూర్వక నమస్కారములను సమర్పించుచున్నాను. నన్ను ఆశీర్వదించుచు వారి అభిప్రాయములను గద్య, పద్యముల రూపమున అందించిన పెద్దలందఱకు వినయముతో కృతజ్ఞతలు ఘటించుచున్నాను.

ఇట్లు

బుధజనవిధేయుఁడు

**తూములూరు శ్రీదక్షిణామూర్తిశాస్త్రి**

**దైవాధీనము సర్వమీజగము; తద్దైవంబు మంత్రంబునన్**
**భావింపంబడు; మంత్రమాబుధులకున్ స్వాధీనమైయుండు నే**
**నా విజ్ఞుల్ సురలంచుఁగొల్తుఁదమబ్రహ్మజ్ఞానసంపత్తి నీ**
**జీవుల్ సద్గతిఁజేరుమార్గముపదేశింపన్ వినమ్రుండనై.**

# కోటీరం

- రామడుగు వెంకటేశ్వరశర్మ, ఇంటి నెం. : 5-19-9(ఎ), శ్రీకవితాసదనం
శ్రీవెంకటేశ్వర బాలకుటీర్ వద్ద, 2/17 బ్రాడీపేట, గుంటూరు - 522 002
ఫోన్: 0863-2243762, సెల్ : 9866944287

మాన్యసాహిత్యమిత్రులు డా॥ శ్రీతూములూరు శ్రీదక్షిణామూర్తిశాస్త్రి గారికి నమస్కృతులు. ఉభయత్రకుశలమ్. ముందుగా సంక్రాంతి శుభాకాంక్షలు.

సగౌరవంగా మీరు పంపిన మీ "శ్రీత్రికూటేశ్వర శతకం"లోని పద్యాలను చదివాను. పరమానందసంభరితుణ్ణి అయ్యాను. ఈ శతకాన్ని చదువుతుంటే ప్రాచీనాంధ్ర భక్తకవుల పద్యాలను పఠిస్తున్న అనుభూతి కలిగింది. "తరణోపాయము నీదు నామమన్న... మొదటి పద్యంలోని "......అక్షరమౌ బ్రహ్మకు నీకు నంకితము నాసాహిత్యమర్థిన్ గళాభరణంబై యలరారఁదాల్పుమన్న వాక్యం ద్వారా కవిత్వాన్ని ఈశ్వరార్పణ గావించిన నిజమైన కవీశ్వరులుగా మీరు కనిపిస్తున్నారు. గళాభరణమేకాదు – మీ పద్యకవిత సాహిత్య 'కళా' భరణం కూడా – "ఎన్నాళ్ళీ కలతల్ మనోవికలతల్.." అన్న 144వ పద్యంలో ఆర్తిరూపమైన భక్తితత్త్వం కనిపిస్తోంది. ప్రాజ్ఞునికీ, సామాన్యునికీగల భేదాన్ని ముఖ్యంగా ప్రాజ్ఞుని స్వరూపస్వభావాన్ని "తన దేహాత్మలకున్న భేదమరయన్ ధన్యుండు" అన్న 145వ పద్యంలో హృద్యంగా వ్యక్తీకరించారు. "బాలుండాటల బాటలన్గడుపు.." ఇత్యాదిగా "బాలస్తావత్ క్రీడాసక్తః" అన్న ఆదిశంకరాచార్యులవారి భజగోవిందస్తోత్రభావాన్ని అందంగా, శార్దూలంపై ఊరేగించారు. మీరు "లోకులు పలుగాకుల్" ఇత్యాదిగా తెలుగు పలుకుబడికి 149వ పద్యంలో గజారోహణ గౌరవాన్ని సమకూర్చారు. తెలుగు పలుకుబడికి పలుకుబడిని పెంచారు మీరు. "కరుణాబ్ధీ!, అహిభూషా!" ఇత్యాది సంబోధనలు యతి స్థానాక్షరం దగ్గఱ ఆగి మీకవితా రచనానుభవజ్ఞతను చాటుతున్నాయి. "జ్యోతిషాంపతి" ఇత్యాదిగా కొన్ని సంబోధనలు సాభిప్రాయాలు. సార్థకాలుగా ఉన్నాయి.

"జగమేనాటకమ"ని ప్రారంభించి "ముగింపు తెరదింపన్ వరకు రూపక వాతావరణాన్ని రూపకాలంకారంగా రూపు కట్టించిన మీ అలంకార కలంకారి – రసవిహారికి మనోహారి. "నినుఁజింతింపగఁ బూనుచో" – అన్న పద్యంలో భక్తమార్కండేయ కథను సూచించడం బాగుంది. "మునుఁగావించిన కర్మసంచితముగా భోక్తవ్యము" అన్న 163వ పద్యంలో ధర్మకర్మమర్మాలను నర్మరహితంగా చెప్పడం శర్మదమైన ఒకరచనావిధానం – బాగుంది. "పదమో, పాటయొ, గేయమో, వచనమో అన్న 167వ పద్యంలో ఉత్తమ రచనాతత్త్వాన్ని చక్కగా ఆవిష్కరించారు. "విమలంబై, వివిధాగమప్రణుతమై.." అన్న 170వ పద్యంలో "ఆత్మలో వెలుగు చైతన్యంబు దర్శించు యోగము నాకిమ్ము" అని మానవుడైనవాడు కోరవలసిన గొప్పకోరికను ఆదర్శప్రాయంగా కోరారు. మీరు "Work is Warship" అన్న ఆంగ్లసూక్తిని "పనియే దైవముగా" అన్న పద్యంలో అనవద్యంగా వ్యక్తీకరించారు.

ఏది ఏమైనా మీపద్యాలలో చమత్కారాలకు అతీతమైన భక్తిభావన ఉంది. ఆర్ద్రత ఉన్నది. ఆవేదనానివేదన ఉంది. భావ, శబ్దపునరుక్తుల ద్వారా జీవుని వేదన పరాకాష్ఠస్థితికి చేరిన తీరుఉంది. ధూర్జటి మహాకవి చెప్పినట్టుగా పరమాత్మస్తుతి ద్వారా ఆ తత్త్వాన్ని ఆవిష్కరించడంలో "చాలుంజాలు కవిత్వముల్ నిలుచునే?... అదిగో! ఆకోవకు చెందినవి మీ శతక రచనలన్నీ, ముఖ్యంగా ఈ "శ్రీత్రికూటేశ్వర శతకం". ఈ విధమైన ఆర్ద్ర భావనతో 100పద్యాలను, శివపురాణ కథలని విశదీకరిస్తూ మరో 100 పద్యాలను సామాజిక పరిస్థితులను ప్రతిబింబింపఁజేసే రూపంలో మరో 100 పద్యాలను మీరు వ్రాస్తే "శ్రీత్రికూటేశ్వర త్రిశతి" పూర్తి అవుతుంది కదా!. ఇది కేవలం నా సలహా మాత్రమే. చెప్పటం తేలికే కాని వ్రాయటం కష్టమే. ఐనా మీరు తప్పని సరిగా వ్రాయగలరు.

శుభంభూయాత్.

మీ

రామడుగు వెంకటేశ్వరశర్మ

## కీ॥ శే॥
## బ్ర.వే. తాడేపల్లి రాఘవనారాయణశాస్త్రిగారు,
## చందోలు.



నిరహంకారులు, నిత్య తృప్తు లనఘుల్, నిర్వ్యాజ కారుణ్య సా
గరు, లాచార పరాయణుల్ సకలలోక స్తుత్యు, లా రాఘవో
త్తర నారాయణు, లార్ష ధర్మనిరతుల్ దాడేపల్లీద్యాన్వయా
భరణుల్, నా, గురుదేవు, లర్థిజనకల్పా । శ్రీత్రికూటేశ్వరా!

### విఘ్నేశ్వరప్రార్థన

కుడుముల్ నీకిడివేఁడఁబందువనుచున్ గోర్కెల్ ప్రసాదించుదే
వుఁడవీవోగణనాథ! విఘ్నతతులన్ బోఁద్రోలిమమ్మేలు; మె
వ్వఁడునిన్బోలుసమర్థుఁడీపుడమి దుర్వారంబులౌదు:ఖముల్
పొడమన్, భక్తులకాశ్రయుండవగుచున్ బోషించిరక్షింపఁగన్;

### గురువందనము

సౌజన్యంబును, సాధుజీవనము, దీక్షాసంప్రదాయంబులున్
బూజాపద్ధతులాత్మ సాధనములామోదప్రమోదంబులై
తేజస్ఫూర్తిఁ బ్రశస్తి ఁగాంచు గురుమూర్తిన్ దక్షిణామూర్తిగా
ఆజీవంబు భజింతు, ఁదాడెపలివిఖ్యాతున్ గృపాంభోనిధిన్.

కవినైయాత్రిశతిన్ రచించు శుభసంకల్పంబు నేఁబూనువే
ళ విశుద్ధాత్ముని సాధుజీవన సముల్లాసున్ బుధానీక వం
ద్యు వచోవైభవజీవుఁదాడెపలివంశ్యున్, సత్కవిన్గొల్తు రా
ఘవనారాయణశాస్త్రి సద్గురుని సత్కారార్హునిన్ నెమ్మదిన్.

### కృత్యాదిపద్యాలు

చనుఁడోభూతపిశాచులార! శ్రుతిసంస్కారంబులన్ రూపుమా
పి నిరాఘాటముగాఁజరించుచు దురావేశంబుతోఁబుణ్యావ
ర్తనులన్ దూఱుచు ధర్మకర్మములకాతంకంబుఁగల్పింపకో,
ర్వనిభూభారముఁదీఱ బ్రహ్మమునుగొల్వన్, బర్వముల్పర్వఁగన్

శివపూజాసమయంబుఁగాఁదెలియవచ్చెన్ సత్యమీవేళ న
య్యవెఘంటారవముల్ ధ్వనించుచు, శుభాహ్వానంబులైదోఁచునా
దివిజానీకముఁజేర, రక్కసుల కాదేశంబులౌఁబొందనన్;
వివిధంబైపొడచూపు విఘ్నతతి నిర్వీర్యంబులై పొఱగన్;

## శ్రీ త్రికూటేశ్వర త్రిశతి

"క్షేత్రంబిద్ది పవిత్ర, మిాశివుని దర్శింపన్ జనుల్, తద్దయా
పాత్రుల్కాగల, రాదిదేవుఁడితఁడాపద్రక్షకుండ"న్న నా
మిత్రోక్తిన్దయనానతిచ్చితివి స్వామీ! వ్యోమగంగాధరా!
స్తోత్రంబున్విను,మాశుతోష! శ్రితబంధూ! శ్రీత్రికూటేశ్వరా!

1. భువనం బాంగిక, మెల్ల వాఙ్మయము నిన్బోధించు విజ్ఞానవై
భవ, మాతారలు సూర్యచంద్రులరయన్ భద్రంబులౌభూష, లా
త్మవిలాసంబగు భక్తపాలన కళాతంత్రంబులన్ సాత్త్వికం
బవలోకింపఁగనయ్యె మాకు నటముఖ్యా! శ్రీత్రికూటేశ్వరా!

2. గిరులందున్ దరులందు, వాయు సలిలాగ్నివ్యోమ భూమ్యాదులం
దు రవీందుప్రభలందు నౌషధములందున్ జంగమస్థావరాం
తర విశ్వంబునఁ జొచ్చియుండు శివ చైతన్యం బుపాసింతుఁ ద్రై
పురసారంబు సనాతనంబు సతతంబున్ శ్రీత్రికూటేశ్వరా!

3. వనమార్గంబులఁ గొండకోనల భయోత్పాతంబుఁ గల్పించు మృ
త్యునిభక్రూర మృగంబులుండునని విందున్, వాని వేటాడి భూ
జనులన్ గాచిన స్వామి ధర్మము ప్రశంసాపాత్రమౌ; నీ జనా
వని దుర్జంతుత మాన్పుటెన్నఁడొకొ? శర్వా! శ్రీత్రికూటేశ్వరా!

4. గురుపాదాంబుజసేవనం బఖిలసంకోచంబులన్దీర్చు, స
ద్వరసందోహ సమృద్ధులిచ్చు శుభముల్ వర్షించు వర్షాభ్రమై,
"గురువే దైవము" తల్లిదండ్రి హితుఁ డెగ్గుల్మాన్చు మిత్రుండు, స
త్కరుణావార్ధి! యతండె నీ వనిరి పెద్దల్; శ్రీత్రికూటేశ్వరా!

5. సకలప్రాణుల కన్నపానములు సౌజన్యంబుతోఁ గూర్చు పూ
నిక నన్నమ్మయు, గంగతల్లి యనుసంధింపన్ బ్రసాదింతువో
సుకృతీ! దానములందు శ్రేష్ఠతమమంచున్ జెప్పిరారెంటి నం
దుకె విశ్వేశ్వరుఁడంచు నిన్ను నుతియింతుర్; శ్రీత్రికూటేశ్వరా!

6. నటనారాధన నిత్యకృత్యమయి విన్నాణంబుఁజూపన్ మహా
నటుఁ డీతండని చూపఱుల్ పొగడ నానందించు భూతేశ! దు
ర్ఘటనల్పెక్కులు చోటుచేసికొనెలోకంబందు వీక్షింతువో
నిటలాక్షా! కపటుల్ నటించు టెపుడేనిన్; శ్రీత్రికూటేశ్వరా!

7. తనకున్గల్గినదానితోఁదనివిఁ జెందన్లేని వాఁడెట్లు హా
యినిపొందంగలఁడిందునందు శరుఁడై స్వేచ్ఛావిహారుండునై
వినఁడో పెద్దలమాట లెందుఁగనఁడో విశ్వంబునం దింతకున్
జనుచోనేరికి వెంటరాదెదియునీశా! శ్రీత్రికూటేశ్వరా!

8. వివిధంబౌశ్రుతివాక్యసంచయమునన్ వేద్యంబు 'బ్రహ్మంబు'గా
వివరింపన్బడెఁ దత్త్వవిద్వరులచే విశ్వేశ! నీవౌదు బ్ర
హ్మవు; స్వేచ్ఛాగతి నామరూపమతి నూహాపోహలందేలు నీ
కవిబృందంబు సమర్థమే? నిజమెఱుంగన్ శ్రీత్రికూటేశ్వరా!

9. అనుకూలంబవుభార్య, సద్గుణగణాఢ్యంబైన సంతానమున్,
ధనవంతుల్ సఖు, లార్త రక్షణ కళా దక్షుల్ భవద్బాంధవుల్
కనదావాసము వెండికొండ, శ్రితవర్గంబాత్మ విద్యోగసా
ధన సంపన్నము; మమ్ముఁబ్రోవు మనవద్యా! శ్రీత్రికూటేశ్వరా!

10. "శివుఁడున్ శక్తి; యభిన్నులీయిరువురున్ సిద్ధించునద్వైత" మం
చు వచింపన్ దొరఁకొందురెందు బుధులా సూక్ష్మంబు రూపింపఁగా
శివ రూపంబున నుందువిందు మది దాక్షిణ్యంబు వాటించుచున్
భవమున్ ద్రుంచి భవత్పదంబిడుము; దేవా! శ్రీత్రికూటేశ్వరా!

11. సతతంబున్నతమౌత్రికూటములతో సంపన్నమై తోఁచు ప
ర్వతరాజంబు నికేతనస్థలముగా రాజిల్లు సర్వేశ్వరా!
శ్రితమందారుఁడవైన నీ మహిమ వర్ణింపన్దరంబే? ఉమా
పతి! నీ పాదములన్ భజింతుఁ గరుణింపన్; శ్రీత్రికూటేశ్వరా!

12. మునుదాఁజేసిన పుణ్యపాపఫలముల్ భోగింపఁగాఁ బుట్టుచుం
దును జీవుండు సుఖంబు దు:ఖమును బొందున్ గుందుఁగాలక్రమం
బున; విశ్వేశ్వరు నిన్ను భక్తి శరణంబున్ గోరఁ బాపక్షయం
బును మోక్షంబునుగల్గు నీకరుణ; శంభూ! శ్రీత్రికూటేశ్వరా!

13. ప్రణవంబన్నది నీదురూపమని చెప్పన్‌వింటి ముక్కంటి! వీ
క్షణ మాత్రంబున దు:ఖముల్‌గెడపి సౌఖ్యంబుల్ ప్రసాదించి ర
క్షణ కల్పించి విశిష్టమేధయును బ్రజ్ఞాశక్తిఁజేకూర్చు నిన్
బ్రణుతింతున్ గరుణింపవే నను; దయార్ద్రా! శ్రీత్రికూటేశ్వరా!

14. తపమున్‌జేయఁగ నిర్జనమ్ము వనమున్, దాపంబువాయంగఁ బా
దపపంక్తుల్ దినఁగందమూలఫలముల్ తానంబులాడంగ నే
టిప్రవాహంబును గోరుకొందురని వింటిన్ స్వామి! నీ కిందు వి
ఘ్నపరుల్ లేరుకదా? సుఖంబె? జితరాగా! శ్రీత్రికూటేశ్వరా!?

15. శిరముల్ కన్నులు కాళ్లు వేలకొలదుల్ చిత్రంబుఁగా రాజిలన్
గరమాశ్చర్యమునం గనుంగొనుచు ఋక్సామాది వేదంబులన్
బరమానందముతోఁ బఠించుచుఁ "బరబ్రహ్మంబు" నిన్నున్ భజిం
పరెమౌనీంద్రులు, విశ్వరూపు! ఋషిసేవ్యా! శ్రీత్రికూటేశ్వరా!

16. ఈశానుండు సమస్త విద్యలకుఁ దానీశుండు భూతాళికిన్
క్లేశంబుల్ తొలఁగించి మేలిసుఖముల్ గీలించి పాలించుచున్
దేశంబుల్ మతికాలమున్ గడచి వర్తించున్ మహాదేవుఁడై;
"యీశావాస్యము సర్వమీజగము" స్వామీ! శ్రీత్రికూటేశ్వరా!

17. భయమున్ బాపి శుభంబుఁ గూర్పఁగ భవత్పాదంబులేచాలు సం
శయముల్ మాన్పి వివేకమున్ గఱప నీ సాన్నిధ్యమే చాలు నా
శ్రయ మారోగ్యము భాగ్య మేర్పరుప నీ సౌజన్యమే చాలు న
క్షయమౌ శాంతి సుఖంబు లీయవె; తమోఘ్నా! శ్రీత్రికూటేశ్వరా!

18. కనులన్‌భద్రములైన వానిఁ గనఁగాఁ గర్ణంబులన్ భద్రముల్
వినఁగా సుస్థిరమైన యంగములతో వేదాంతవేద్యున్ గప
ర్దిని నిన్‌గొల్వఁగ నోర నీ మహిమఁ గీర్తింపన్ బ్రసన్నుండవై
యనయంబున్ శరణంబు నీయవె; ప్రపూతాత్మా! త్రికూటేశ్వరా!

19. నను మన్నింపఁగఁ జాలు వారెవరు శాన్తస్వాంతులై స్వామి! నీ
వు నుపేక్షింపఁగ వేరెదిక్కుఁగలదే! పూజాసుమంబై సమ
ర్చన సేయంగయికొమ్ము నాతనువు నాప్రాణంబు నాత్మేశ్వరా!
వినుతింతున్ వినయంబుతో, నిను; మనస్వీ! శ్రీత్రికూటేశ్వరా!

20. మునిమూర్ధన్యులు మాన్యులున్ ధృతిఁ దపఃపూతాత్ములై పంచవ
క్త్రుని నిన్నుంగని "పంచభూతమయుఁడీ రుద్రుండు సర్వాత్మకుం
డనఘుండాద్యుఁడు వేదవేద్యుఁడు నవిద్యాధ్వాంతమున్ మాన్పఁజా
లిన భానుండని" బోధఁజేయుదురు; శూలీ! శ్రీత్రికూటేశ్వరా!

21. ఋణమే కారణమన్నిబంధముల కెల్లేదానిదీర్పన్‌క్షణ
క్షణమున్‌ఁ జీవుని యత్నమొప్పు సుఖదుఃఖంబాత్మ భావించుచున్
ఋణమున్‌దీరిన దూరమౌ సకలమున్; రేయింబవళ్ళున్ నినున్
బ్రణుతింతున్ భవపాశమోచనముఁగూర్పన్! శ్రీత్రికూటేశ్వరా!

22. నెపమున్‌మోపి, విరోధమున్ నెఱపి, దుర్నీతిన్ బ్రవర్తించుచున్
విపరీత ప్రతిభాషలాడుచు నినున్ ద్వేషించు దక్షప్రజా
ధిపు గర్వంబు నడంచి, దాంతివయి శాంతిన్ దక్షిణామూర్తివై
తపమున్ జేసితి వీప్రదేశమున భద్రా! శ్రీత్రికూటేశ్వరా!

23. చరమున్ స్థావరమౌ ప్రపంచము సమస్తంబీశ్వరాధీనమౌ
టరయన్ నేరఁడు మూర్ఖుఁడెన్నఁడు మహాహంకార దుర్వాదబో
ధరతుండై "కనులుండి గ్రుడ్డి" యగు నాతండెంచఁ డధ్యాత్మయో
గ రహస్యంబు నినున్ భజించుటని; త్ర్యక్షా! శ్రీత్రికూటేశ్వరా!

24. ఆరోగ్యంబును, భోగభాగ్యములు నాహారంబు సంభారముల్
దారాపుత్రులు, బంధుమిత్రులు భవద్భవ్య ప్రసాదంబు, లా
ధారం బీవ జగత్త్రయంబునకు నార్తత్రాణ దక్షుండవో!
తారానాయకశేఖరా! మనుపుమాద్యా! శ్రీత్రికూటేశ్వరా!

25. జాగ్రత్స్వప్నసుషుప్తులం బొదలు నే చైతన్య మద్దాని నే
కాగ్రంబైన మనంబునన్గనిన బ్రహ్మజ్ఞాన మాత్మానుభూ
తిగ్రాహ్యంబగు, మోహముల్ దొలcగు, నాధివ్యాధులున్మాను! మా
యాగ్రస్తున్ ననుcగావవే; నిగమవేద్యా! శ్రీత్రికూటేశ్వరా!

26. సనకాదిప్రముఖుల్ఋషీశ్వరులు నిష్ఠన్గొల్వ, నేత్రంబులం
దిన చంద్రానల తేజముల్ పరగ, విశ్వేశుండవై లోకముల్
వినుతింపన్  బహునామరూపములతో వెల్గొందు సర్వాత్మకా!
నినుc గాకెవ్వరి వేcడుకొందు ననుమన్నింపన్; త్రికూటేశ్వరా!

27. గురునామస్మరణంబు దు:ఖహరమై కోర్కెల్ ఘటించున్, శుభం
కరముల్ సంపదలిచ్చుc, దత్త్వము నెఱుంగన్గూర్చు జ్ఞానంబు, సు
స్థిరమౌధర్మము, బ్రహ్మమున్ మదిc బ్రతిష్ఠించున్;ప్రభూ! నాకు సద్
గురుcడున్ దైవము నీవె! ఆశ్రితుcడ నీకున్ శ్రీత్రికూటేశ్వరా!

28. తునుమాడన్ దగదే? ప్రమత్తుల మదిన్ దుష్టత్వమున్, దుష్కృతిన్;
గనులన్ గాంచి యుపేక్ష సేయుటిది యుక్తంబే?జగన్నాయకా!
నిను సేవించిన వారి దు:ఖములు శాంతించున్ బ్రమోదంబు గ
ల్గును సద్యోగ్యఫలంబుcజేరును; దయాళూ! శ్రీత్రికూటేశ్వరా!

29. భువిపైనున్న సుఖంబులన్నియును సంపూర్ణంబుగాc దృప్తినీ
యవు; దైవీగుణసంపదన్గలుగు నయ్యానందమే శాశ్వతం
బవు, యోగం బది పుణ్యపాక, మనపాయంబౌ నుపాయంబునా
యువు నారోగ్యము భాగ్యమున్ గలుగcజేయున్; శ్రీత్రికూటేశ్వరా!

30. తపమున్ జ్ఞానము కర్మమున్ నెఱపc దత్తద్ధర్ముల్ వర్థిలున్
సుపథంబై మతి యోగమన్నిట ఫలించున్ నిక్క మద్దాని బో
ధపడం జేయcగయోగివై వెలయు మేధాదక్షిణామూర్తి! స
త్కృప రక్షింపవె భక్త కోటి ననురక్తిన్; శ్రీత్రికూటేశ్వరా!

31. కనcజాలన్ వినcజాల సంస్మరణమున్ గావింపc గాcజాలc జి
ధ్వను నిన్నొక్కనిc దక్క నన్యులcద్రినేత్రా; శ్రీభవానీపతీ!
నిను సేవించి తరించు భాగ్యమిదc గా నీకున్ నివేదింతు, నా
జననంబున్ సఫలంబుc జేయవె; మహేశా! శ్రీత్రికూటేశ్వరా!

32. గృహముల్, వాహనముల్ గృహోపకరణ క్రీడావినోదంబులున్
బహుకాలంబుహరింప, వృద్ధత, మతిభ్రాంతిన్ బ్రకల్పింప నా
గ్రహమోహగ్రహముల్ గ్రసింపజడుcడై కర్తవ్యతామూఢుcడై
సహనంబున్ దుదిc గోలుపోవు నరుcడీశా! శ్రీత్రికూటేశ్వరా!

33. శివ! నీనామమనంత పాపహరమై శ్రేయంబులన్ గూర్చుc బు
ణ్య విభూతిన్ ఘటియింపc జేయు, మహితానందంబుసంధించు, సం
స్తవనీయంబగు కీర్తి సంపదలు విస్తారంబుగా నిచ్చు శ
బ్ద విశేషంబది నీదు మంత్ర మెదc గొల్వన్! శ్రీత్రికూటేశ్వరా!

34. కరుణాంత:కరణుండవై వ్యథితులన్ గాపాడు నీకీడుగా
రొరులేనాcడు! దురంతదు:ఖదము పాపౌఘంబుcబోcద్రోవవే
హరుcడన్నన్ హరియించువాcడనెడు శబ్దార్థంబు సత్యంబుcగాc
బురసంహారి! జగద్విహారి! పరశంభూ! శ్రీత్రికూటేశ్వరా!

35. జగమందెందఱు లేరు దుర్జనులు, దుశ్చారిత్రకుల్ దుర్మతుల్
తెగరే? రుద్రకరాసిచేc బురహరా! దీప్త ప్రకోపానలా!
ఎగురన్బూనుచుc గుప్ప గూలిరనిలో నెంతెంత వారల్; మహో
రగభూషా! విషకంధరా! విషమనేత్రా! శ్రీత్రికూటేశ్వరా!

**36.** కరముల్ కర్ణములున్ శిరం బురము వాక్పాదాక్షి చిత్తంబులన్
స్థిరమౌభక్తి ఘటించి నిన్నుఁ గొలుతున్ శ్రీదక్షిణామూర్తి! మే
ధ రవంతైనను గూర్చి, నీపద నిదిధ్యాసంబుఁగల్పింపు మ
క్షర! ప్రజ్ఞానఘనంబుగాఁగల మనీషన్! శ్రీత్రికూటేశ్వరా!

**37.** ఏవేదంబుఁ బఠింపలేదు, తమితోనేశాస్త్రముల్ చూడ లే,
దేవిద్యాభ్యసనంబొనర్ప ననయంబేమంత్ర మూహింప: బో
ధావిర్భావనిధాన! నీదు పదముల్ ధ్యానింతు సంపూర్ణయో
గావష్టంభ సుఖానుభూతి నిడుమయ్యా! శ్రీత్రికూటేశ్వరా!

**38.** చెడు వారింపఁగ నుగ్రమై పొలుచు నీ చిత్తంబు, రూపంబు. మ్రొ
క్కెడు వారింగరుణించు వేళ శుభముల్ గీలించు శాంతస్థితిన్.
నడి సంద్రంబునఁ జిక్కు నావవలె సన్త్రాసంబునన్ బొక్కు నా
యెడరున్ మాన్పి, జగత్ప్రభూ! అభయమీవే! శ్రీత్రికూటేశ్వరా!

**39.** నమకంబున్ బఠియించి, నీదగు ననంతత్వంబు దర్శించుచున్
దమమున్‌బాసి ప్రబోధమున్‌బడసి, సత్యజ్ఞాన సంపన్నుఁడై
శమితాహంకృతి, నాత్మతత్త్వవిదుఁడై సంతుష్టుఁడౌ జీవి, పూ
ర్ణమునన్‌దోఁచిన పూర్ణుఁడౌచుఁబరిపూర్ణా! శ్రీత్రికూటేశ్వరా!

**40.** నీ నామంబుఁదలంపఁ బాపభయముల్ నిర్మూలమైపోవు, ని
త్యానందంబు ఘటిల్లు; విశ్వమును, విశ్వాధారచైతన్యమున్
నానారూప గుణాదులెన్న భవదానంత్యంబు నద్వైత వి
జ్ఞానంబున్ వెలయించు! శిష్టజనరక్షా! శ్రీత్రికూటేశ్వరా!

**41.** అవమానించుచు హాస్యమాడుచు సమస్యల్ సృష్టిగావించు చు
త్సవవేళన్ బరుషోక్తులన్ బలుకుచున్ దర్జించి భర్జించుచున్
అవిధేయంబుగఁ జేయువృత్తియెడ లక్ష్యంబేమియున్‌లేక లే
నివియున్‌గానివి చేర్చిచెప్పు ఖలుఁగంటే! శ్రీత్రికూటేశ్వరా!

**42.** నను జీవింపఁగఁజేయువారెవరు ప్రాణంబై తనుత్రాణమై
నను లాలింపఁగఁ జాలు వారెవ రనంత ప్రేమ తత్త్వంబునన్
నను రక్షింపఁగ దక్షులెవ్వరు? జగన్నాథా! సమర్థుండవీ
వను విశ్వాసముతో భజింతు! బుధవంద్యా! శ్రీత్రికూటేశ్వరా!

**43.** శిథిలంబయ్యె శరీరమిందు నిలువన్ జిత్తంబు లేదెన్నఁడీ
వ్యథలన్‌బాపి భవత్పదంబు సమకూర్పన్ జూచెదో శంకరా!
ప్రథితంబైన పురాణగాథలు జగత్‌భావంబు నీయాజ్ఞచే
గ్రథితంబౌనని చెప్పవే; త్రిపురహర్తా! శ్రీత్రికూటేశ్వరా!

**44.** దక్షుండెచ్చిన కక్షతోడ జగదంతర్యామినిన్, దేవతా
ధ్యక్షున్ సాక్షిని నిన్నుదూటి సతికిన్ దాపంబుఁ గల్పింప ఫా
లాక్షా! నీవట వీరభద్రుఁడవుగా నవ్వానియజ్ఞానమున్
శిక్షన్‌జేయవె దుష్టగర్వదహనార్చీ! శ్రీత్రికూటేశ్వరా!

**45.** పరమేశా! గిరిశా! గిరీశ! గిరిజాప్రాణేశ! సర్వేశ! యం
చు, రమేశప్రభృతుల్ సురల్ ప్రణతులై స్తోత్రంబుఁ గావించుచున్
నిరతంబున్ భవదాజ్ఞలన్ నెఱప నిర్ణిద్ర స్వభావంబు తో
నిరహంకారత వేచి చూచుదురు, మౌనీ! శ్రీత్రికూటేశ్వరా!

**46.** సతతం బీసుఖదు:ఖముల్ పరులచే సంప్రాప్త మౌనంచుఁ గు
త్సితు లూహింతురుగాని స్వీయకృతముల్ సిద్ధించు నా యా గతిన్
మతిమంతుల్ దురితక్షయంబెనయఁ గామ్యంబుల్ గనన్, ముక్తి సం
గతిఁ గాక్షించుచు నిన్దలంతు రెద భర్గా! శ్రీత్రికూటేశ్వరా!

**47.** అనుకంపానిధి! దేవదేవ! మది నిన్‌ధ్యానించు యోగంబు గ
ల్గిన సిద్ధించును శాంతి సౌఖ్యములు! నిన్గీర్తించు వేదంబు, ల
మ్మునిముఖ్యుల్ పరిపూర్ణు నిన్నెఱిఁగి దుర్మోహంబులన్‌వీడి ము
క్తి నిధానంబనుచున్ భజించెదరు భక్తిన్; శ్రీత్రికూటేశ్వరా!

48. కామక్రోధములాత్మదుర్గతికి మార్గంబుల్, ప్రలోభంబుతో
డై మర్యాదల మంటఁగల్పు; నెదమోహాంధ్యంబుఁగప్పన్ మదం
బామాత్సర్యముఁ గూడివచ్చు; దయతోనయ్యాపదల్ మాన్పి, యు
ద్దామధ్యానసమాధులిమ్ము! పరమాత్మా! శ్రీత్రికూటేశ్వరా!

49. పదిలంబొప్పఁ జపింపఁజాల శుభమౌ, పంచాక్షరీ మంత్రమున్
మదినావేదన మాన, దాపదలు ముంపన్ జంపఁ బైకొన్న నీ
పదముల్ పట్టి భజింతు భక్తనిధి! తాపంబుల్ నివారింపవే
ఇదె నేఁజేసెదు పూజఁ గైకొనవె! సర్వేశా! త్రికూటేశ్వరా!

50. వేదం బా పరతత్త్వబోధకలనావిష్కార సంపన్న మా
వేదంబే శివ! నీదు నిశ్వసితమై వేద్యంబు, నీరూపుగా!
వేదార్థంబు గ్రహింప సత్యముగ నీవిశ్వంబు నీవౌట, స
మ్మోదంబావహిలన్ దలంతుననిశమ్మున్ శ్రీత్రికూటేశ్వరా!

51. సర్వజ్ఞా! మొఱలాలకింపుము, మహేశా! మమ్మురక్షింపుమా
గర్వాంధుల్గనలేరు నిక్కముగ నిన్, గంగాధరా! శంకరా!
దుర్వారంబగు దు:ఖమేగతిఁ దరింతున్ దుష్ట సంహారకా!
నిర్వైరంబొనరించి పర్వమిడు శాన్తిన్! శ్రీత్రికూటేశ్వరా!

52. తనకున్ దానె విరోధి"యిజ్జగము సత్యం" బంచు భావించినన్
దనకున్దానె విశిష్టబంధువగు సద్ధర్మంబుఁ (గర్తవ్యంబు) బాటించినన్
మనసేకారణమౌ సమస్తమున కీమాయా ప్రపంచంబునం
దని వార్యంబు వివేకవర్తనము! ధ్యేయా ! శ్రీత్రికూటేశ్వరా!

53. జీవుండున్ బరమాత్మ, యైక్యమెనయన్ జిన్ముద్ర, తద్బ్రహ్మమున్
భావింపన్దగు మౌనముద్ర, పరమానందంబు సంధించు ధ్యా
నావష్టంభము యోగముద్రయయి నీయంతర్ముఖత్వంబు మా
కావిష్కారమొనర్చు సంయమిశరణ్యా! శ్రీత్రికూటేశ్వరా!

54. వరకారుణ్యము నీ స్వభావమని చెప్పన్విందు, నీ సత్య సుం
దర రూపంబుఁదలంపఁగా శివము, శాంతంబబ్బు, భక్తాళినా
దరమేపారగఁ బ్రోతువీవు సకలార్థంబుల్ ప్రసాదించి, శం
కర! నీ పాదములంటి మ్రొక్కెద సురక్షా! శ్రీత్రికూటేశ్వరా!

55. అనివార్యంబు సమస్తలోకులకు జిహ్వాచాపలం బెన్నఁడున్
దన సౌఖ్యంబెదఁగోరి యన్యుల కనర్థం బాచరింపన్దలం
చు నృశంసుండతిదారుణంబుగ వధించున్ జీవసంఘంబు, భూ
తనికాయంబది నీదు రూపమనకాత్మన్; శ్రీత్రికూటేశ్వరా!

56. పవలున్రేలు పరిశ్రమించి బుధు లాప్రజ్ఞానిధుల్ లోకతం
త్రవిదుల్ "దుష్టుల కెల్ల దూరముగ నుండన్ జెప్పి "రమ్మాట"విం
టివె? కష్టంబుల పాలుగాఁగ వరమున్ నీపైఁబ్రయోగింపఁగా
ర్పవె? భస్మాసుర హస్త మయ్యసురకప్పా! శ్రీత్రికూటేశ్వరా!

57. సకలాధారము, శాంతరూపము, తపస్సంవేద్య, మధ్యాత్మసా
ధక, మానంద నిధాన, మాశ్రితజనోత్సాహప్రమోదావహం
బకలంకంబు కళానికేతనము, సత్యజ్ఞాన సంపన్న మ
ర్చక సౌభాగ్యద, మీశ్వర ప్రకృతి; భద్రా! శ్రీత్రికూటేశ్వరా!

58. బ్రతుకుల్ సార్థకమౌనె? నీ పదములారాధింపఁగా లేమి! త్వ
ద్వ్రతమున్బూని చరించు భక్తులకు సౌభాగ్యంబు సిద్ధించు, సం
తతి వర్ధిల్లుఁ దదన్వయంబును బవిత్రంబై విరాజిల్లు, ధ
న్యతమం బాగతి దేశకాలకృతులెన్నన్ శ్రీత్రికూటేశ్వరా!

59. తనువున్బ్రాణము జ్ఞానమున్ బడసి తత్తత్కారణంబౌ ఋణం
బును దీర్పన్, నరజన్మ సార్థకమగున్! బుణ్యంబు వర్ధిల్లఁదా
మనమున్ వాక్కును కర్మమున్ సమముగా మర్యాదలన్ బూనుచున్
మనెనేనిన్బురుషార్థముల్ కలుగు; సమ్మాన్యా! త్రికూటేశ్వరా!

60. పాపంబుల్ తొలఁగించి దుఃఖములఁబాపన్‌జాలు నీ సన్నిధిన్
దాపంబుల్ శమియించి నిత్య సుఖమందన్ గల్గు భక్తాళికో
ఆపద్బాంధవ! మమ్మునాదుకొనవే, యానందమున్ గూర్పవే
శాపగ్రస్తుఁడ, ముక్తినిమ్ము; శశిభూషా! శ్రీత్రికూటేశ్వరా!

61. ఎవరేరీతిఁ బ్రబుద్ధినంది ఘనులైరెందెందు నాయా విశే
షవిభూతుల్ భవదంశసంజనితతేజఃపుంజముల్, నిత్య సం
స్తవనీయంబు లమేయశక్తియుతముల్ ధర్మ ప్రతిష్ఠామహో
త్సవనిర్వాహకబృందముల్ తెలియ;నీశా! శ్రీత్రికూటేశ్వరా!

62. జగముల్‌దానుసృజించుఁ, బ్రోచుఁ, దతితో సంహారమున్‌జేయు స
ర్వగుణాతీతుఁడుశర్వుఁడీతఁడని నిర్వర్ణించు వేదంబు లా
ర్ష గణంబుల్ స్తుతియించు, భక్తిమెయి నారాధించు లోకంబులున్,
దిగకంటీ! చరణంబులంటిశరణంటిన్! శ్రీత్రికూటేశ్వరా!

63. సవనంబందు హవిస్సులంది సుమనస్సంఘంబు సంప్రీతిఁజెం
దివరంబుల్ ఘటియించు, భక్తులకు భుక్తిన్ ముక్తి ఁగల్పించు, ను
త్సవ సంధాయక మగ్ని తేజమది; వేదంబష్టమూర్త్యాత్మకుం
డవునిన్నున్ స్తుతియించు, దేవగణమాన్యా! శ్రీత్రికూటేశ్వరా!

64. రసవత్‌కావ్యఫలంబు సూరివరులౌరాయంచుఁ గీర్తింప, మా
నసభూమిన్ శుభవృత్త బీజమనుపొందన్‌జేసి, పోషించి, ప
ర్ణసమూహంబులు వర్ణనల్ కుసుమవర్గంబయ్యలంకార మా
త్మసమంబౌధ్వనిఁ గూర్పనెంతురుప్రణేతల్! శ్రీత్రికూటేశ్వరా!

65. నీలీలల్వినుచున్ బఠించుచెదలో నీరూపు భావించు చే
వేళన్ నీకభిషేక మర్చనలుగావింపన్ భవన్నామముల్
మాలామంత్రములన్ జపించుచు మనోమాలిన్య ముల్‌సర్వము
న్మాలింపన్ దపియింత్రు భక్తులనయంబున్; శ్రీత్రికూటేశ్వరా!

66. జగముల్‌సృష్టియొనర్చి ప్రోచు భవుఁడై, సంహారమున్ బూనిచే
యఁగ రుద్రుండు, శుభంబు లిచ్చునెడ నిత్యారాధ్యుఁడాశంకరుం
డగు, మేధాస్థితి, ప్రజ్ఞయున్ గలుగఁజేయన్ దక్షిణామూర్తియౌ,
వగలన్ మాన్చి ప్రశాంతి నిచ్చు శివతత్త్వం!బో!త్రికూటేశ్వరా!

67. దైన్యంబందరు, గర్వమున్ గనరు, చిత్త స్థైర్యమున్ వీడ, ర
న్యోన్యంబున్ గలహింప రాగ్రహమునన్, యోగానుసంధానుల
మ్మాన్యుల్: కల్గు ప్రియాప్రియంబులను సంభావింపరేనాఁడెదన్
ధన్యుల్‌తాపసు లంజలించెద మహాత్మా! శ్రీత్రికూటేశ్వరా!

68. తనదౌ యోగము, క్షేమమే తలఁచు స్వార్థస్వాంతుఁడెందీజగం
బున నెవ్వారికి నేవిధంబున శుభంబున్ జేయ డెన్నండు; గం
గనుబాటించుచుఁ, గాలకూటవిషమున్ గంఠంబునన్‌నిల్పి చ
ల్లని చంద్రున్ఁదలఁదాల్చు నీదయ యనల్పం,బో!త్రికూటేశ్వరా!

69. నా దైన్యంబును నిస్సహాయతయు విన్నన్ జూచినన్ గల్గలే
దా? దాక్షిణ్యము! భక్తరక్షణసమర్థా! స్వామి! విశ్వేశ! నీ
యౌదార్యంబు నుతింతురే బుధులమేయా! నా మొఱాలించి యా
హ్లాదం బీయవె పాపసంహరణ! ధుర్యా! శ్రీత్రికూటేశ్వరా!

70. మదిభావించుచు, నీదురూప మెనయింపన్ జూచి, యారామ సం
పదలన్ గూర్చి, మహోత్సవంబులొనరింపన్ బూని పూజాదులన్,
బదముల్ పాడుచుఁ బద్యమాలలెలయింపన్‌జేసి కైసేసి, స
మ్ముదమున్ గాంచును భక్త కోటి యనిశమ్మున్! శ్రీత్రికూటేశ్వరా!

71. విషమేయౌనమృతంబు నిన్నెదను భావింపన్ మహాదేవ! ని
ర్విషయానంద విధాయి భాసురపదా! విజ్ఞాన సంపత్ప్రదా!
ధిషణాహంకృతి ధర్మసంస్కృతి నిరోధింపన్ విరోధించు వి
ద్విషు లీ(లా)దోషుల రూపుమాపవె; యశస్వీ! శ్రీత్రికూటేశ్వరా!

72. కనఁగాఁగన్నులు లేవు, గోడువినఁగాఁ గర్ణంబులున్ లేవు, భ
క్తునిఁ గాపాడఁగఁ గాలుసేతుల ప్రవృత్తుల్ లేవు, ముక్త స్వభా
వుని నిత్యున్నిను శుద్ధ బుద్ధ పరితృప్తున్ "బ్రహ్మమున్" గాంచి యే
మని ప్రార్థింతు సుఖమ్ము లిమ్మనుచు; జ్ఞేయా! శ్రీత్రికూటేశ్వరా!

73. తనలోఁదాను గనుంగొనన్ దెలియు సత్యం, బాత్మ, దేహంబుక
న్నను వేరొండుగ వెల్గుచుండునని, పూర్ణంబైన బ్రహ్మంబు నం
శను దానుండుట; వాసనాత్రయము నాశంబైన బ్రహ్మంబె తా
నని తోఁచున్ ద్రిగుణంబులున్ దొలఁగు; శాన్తా! శ్రీత్రికూటేశ్వరా!

74. తనువున్ దస్సి, కఫంబు, వాతగతి పిత్తంబున్ బ్రకోపించి పో
మ్మనియూ, రింకిటురమ్మటంచచటి వారాదేశముల్ పంపఁగా
నిను భక్తిన్ దలపోయు యోగమది సందేహంబుగానన్ మహా
త్ముని వేదప్రతిపాద్యు నేఁడెస్మరియింతున్; శ్రీత్రికూటేశ్వరా!

75. పురుషార్థంబులలోఁదురీయమగు నాముక్తిన్గనన్ భక్తియే
పరమోత్కృష్ట పథంబుఁ గాఁదలఁచిరాప్రజ్ఞానిధుల్ దేశికుల్
నిరపాయంబు నుపాయమౌనిదియె నిర్నిద్రస్వభావంబునన్
శరణంబౌ నినుఁ జేరి కొల్చుటకు; నీశా! శ్రీత్రికూటేశ్వరా!

76. జననంబాదిగ సర్వ జంతుతతి సంసారభ్రమన్ దు:ఖపం
కనిమగ్నంబగుచన్నపానరతమై కాంతాకటాక్షైకసా
ధన సంపత్సకలార్థమై బ్రతుకఁగా, ధర్మైకదీక్షారతుల్
మనుజుల్ ప్రస్తుతిఁ గాంత్రుమోక్షగతి! సాంబా! శ్రీత్రికూటేశ్వరా!

77. "జననంబందుట దు:ఖ" మాత్మకు, జరాజాయాదులున్ దు:ఖభా
జనముల్, వేమఱు చావు పుట్టుకలతో సంసారమే దు:ఖమౌ"
నని యోజించుచు జాగరూకులయి నిన్ ధ్యానించు యోగంబు గ
ల్గిన ధన్యుల్ దుదిముక్తులౌదురు గురూక్తిన్; శ్రీత్రికూటేశ్వరా!

78. పిలువన్ బల్కరు, చూడరాదరమునన్, వేడంగ నాలింప, రా
శలుఁబూరింపఁగఁబూనరార్ద్ర మతులై, శాంత స్వభావంబుతోఁ
దలఁపన్ నేరరు తామె మేమనెడి యద్వైతంబు, నిత్యం బెదన్
గొలువై యుందురు సాక్షిగాఁ దమరు; మ్రొక్కుల్ ! శ్రీత్రికూటేశ్వరా!

79. నానారూపధరుండవై వివిధమౌ నామంబులన్ బొల్చు ని
న్ధ్యానింపన్ జపియింప నర్చనలఁదన్పన్ శక్యమే? యేరి, క
జ్ఞానాంభోధి నిమగ్నమై మనము నైశ్చల్యంబుఁ గోల్పోయెఁ బూ
ర్ణానందప్రదమౌ పదంబొసగు మయ్యా! శ్రీత్రికూటేశ్వరా!

80. నినుభావించుచు నీదు లీల లభివర్ణింపన్, మనోవాగ్విశు
ద్ధి నిరూఢంబగు, నిష్ట సిద్ధి కలుగున్; దీనావనా! భక్త పా
లన ధుర్యా! శరణార్థి నన్ప్రియమునన్ లాలింపవే, మోక్ష సా
ధన సంపత్తి నొసంగవే, శుభములందన్; శ్రీత్రికూటేశ్వరా!

81. మౌనమ్మే కలహమ్ము మాన్పు, జన సమ్మానంబుఁ గల్పించు, వి
జ్ఞానమ్మున్ బ్రభవింపఁ జేయుచు, దురాశామోహపాశచ్ఛటల్
లూనంబున్ బొనరించు, శబ్దమయ కాలుష్యంబు వారించు, న
మ్మౌనమ్మే సకలార్థసాధకము, సౌమ్యా! శ్రీత్రికూటేశ్వరా!

82. మనమున్ మాటయు మాన్యమైపరగుసన్మార్గంబుఁదామెంచి య
మ్మని వాల్మీకియు, వ్యాసుఁ డీకవికులమ్మున్ జ్ఞాన విజ్ఞాన సా
ధనమై యొప్పు కవిత్వతత్త్వ మనుసంధానించి లోకంబునన్
గనరే కీర్తి ధనంబు, ఁబుణ్య, మపవర్గంబున్ ద్రికూటేశ్వరా!

83. కవితల్ వ్రాయుట నేరమౌ ననుటనిక్కంబైన, సత్కావ్య సం
భవమే రీతిని సాధ్యమౌ? రసము నాస్వాదించుటానందహే
తువుగాఁ జెప్పుట చెల్లునే? కృతులు సంస్తుత్యంబులౌనే? కళా
నివహంబియ్యది నీస్వరూపమని వింటిన్; శ్రీత్రికూటేశ్వరా!

**84.** నరుఁడా యుద్ధముఁజేయుచో నతని కన్నన్ ముందుగా నీవుసం
హరణోద్యోగమునన్ బ్రవర్తిలుచు నాయావీరులన్ జంపగాఁ
బరమాశ్చర్యముతోఁ గనుంగొనుచు నప్పద్మాక్షుఁ బ్రశ్నింప, నీ
దు రహస్యంబు వచించెనాతఁడని విందున్; శ్రీత్రికూటేశ్వరా!

**85.** "క్షేమంబే సఖులార! మీ"కనుచుఁబ్రశ్నించున్ సమాజం బదెం
తోమర్యాదగఁ బూటపూటకిటు లాయుఃక్షీణమౌచుండ, మా
క్షేమంబెక్కడ? నీటి మూటలివి యోజింపన్; దయాశాలివై
సామీప్యంబున నిల్పి, మమ్మరయుమీశా! శ్రీత్రికూటేశ్వరా!

**86.** మెడ చుట్టుంగలపాము; నెత్తిపయి సంవేశించు పెన్వెల్లి; చే
నిడుకాలాగ్ని, గళంబునన్ గరళమౌ నెన్నంగ సంసార, మె
వ్వఁడు నీతీరున నిర్వహింపఁగలఁ డబ్బా! ముక్తి సంపత్తి యే
ర్పడ నీ సన్నిధిఁ జేర్పవే భయ(వ)ముఁ దీర్పన్; శ్రీత్రికూటేశ్వరా!

**87.** లీలన్గాలునిఁ దోలె, మన్మథుని ఁగాల్చెన్ గ్రోధ సందీప్తి, మ
మ్మేలన్ జాలు దయార్ద్రబుద్ధియని బ్రహ్మేంద్రాదులున్ భక్తి భా
వాలంకార వినమ్రులై కొలుతురయ్యా! నిన్ను మృత్యుంజయా!
నీలగ్రీవుని, ఫాలలోచనుని, తండ్రీ! శ్రీత్రికూటేశ్వరా!

**88.** ప్రత్యక్షంబగు దైవమీరవిని నారాధింప, నారోగ్యమున్
ధృత్యుత్సాహ వివేక సంపదలు వృద్ధిన్గాంచుఁ దచ్ఛక్తినే,
యత్యాయత్తతఁగొల్చు నిజ్జగము గాయత్రీమహాదేవిఁగా;
సత్యంబాతఁడె భర్గుఁడౌననిరుపాస్యా! శ్రీత్రికూటేశ్వరా!

**89.** కైలాసాచలవాస! భక్త జనరక్షాదక్ష! కారుణ్యభూ
షాలంకార! సురేంద్ర వందితపదాబ్జా! యోగిసంసేవితా!
లీలాస్వీకృత విగ్రహా! జగము సంలీనంబుఁ గావించు నీ
యీలింగాకృతియర్చితవ్యముసదా; ఈశా! త్రికూటేశ్వరా!

**90.** మాయామోహవనిన్ భ్రమించుచుఁ దపోమార్గంబులన్ దప్పి, ప్రా
ణాయామాదిసమస్తసాధనములొయ్యన్‌బాసి, దిక్కేది, నీ
సాయంబందఁగ వేఁడుకొందు దయతో సంత్రాసమున్ మాన్పవే
నాయజ్ఞాన తమంబడంగి వెలుగూనన్; శ్రీత్రికూటేశ్వరా!

**91.** తెలియన్ మేలగు శాస్త్రముల్విడిచి వర్తింపన్ బ్రమాదంబు; కాఁ
గల కార్యంబునకున్ విఘాతమగు; విఘ్నంబుల్ ప్రవృద్ధంబులౌ;
చలచిత్తుల్ గనలేరు సత్యము నవిశ్వాసంబుతో; బుద్ధి వ
ర్ధిలఁజేయంగల జ్ఞానమూర్తి! నుతకీర్తీ ! శ్రీత్రికూటేశ్వరా!

**92.** స్మరణంబున్ మననంబు ధ్యానము మనీషన్ బాపముల్పాపి పు
ణ్యరమన్‌జేకుఱఁజేయు, ముక్తినిడు, నీ నామంబు, రూపంబు శాం
తరసస్ఫూర్తి; నిరంతరంబు హృదయాంతర్వర్తియౌజ్యోతివై
పరమానందము నిచ్చి కావు మనుకంపన్; శ్రీత్రికూటేశ్వరా!

**93.** చెవిలో నెప్పుడు గూడుకట్టుకొని యశ్లీలంబులన్ జెప్ప విం
చు వినోదింతురు, కల్లబొల్లికబురుల్ శ్రోత్ర ప్రియంబౌట: బు
ద్ధి విచారించి యథార్థమున్ గనరు! భుక్తిన్ ముక్తిఁ జేకూర్చుని
న్ను వివేకంబునఁ గొల్వఁ బోవరెద మందుల్; శ్రీ త్రికూటేశ్వరా!

**94.** ధనదుండాశ్రితుఁ డాప్తమిత్రుఁడుమహోదారుండు శ్రీనాథుఁడా
ర్తి నివారింపఁగ సర్వకార్యములు నిర్విఘ్నంబులౌనిర్జ రా
లినిఁగాపాడెదు నాయకుల్ సుతులు, తల్లీలావినోదంబులన్
దనుపున్‌విశ్వమునెల్ల నీసతి; సమర్థా! శ్రీత్రికూటేశ్వరా!

**95.** శరదిందుప్రభగా, వసంత సుమనస్సౌరభ్యసారంబుగా,
వరమందారవనాంతర ప్రకృతి సౌభాగ్యంబుగాఁ బొల్చు, నీ
పరమోదారచరిత్రమున్‌బరహిత ప్రారంభమున్ దెల్పు స
ద్గురు బోధల్, శ్రుతిశాస్త్రసంగతులు విందున్; శ్రీత్రికూటేశ్వరా!

96. పరమధ్యేయ మభీష్టదంబు శివభావంబంచు ఘోషించు న
క్షరమై వెల్గెడు వేద వాఙ్మయము, శాస్త్రంబుల్ పురాణంబులున్;
పరమానందమొసంగు నీపదములెవ్వండంతరంగంబునన్
స్మరియించున్ బుధుఁడాతఁ; డర్థిజనగమ్యా! శ్రీత్రికూటేశ్వరా!

97. పాపాత్ముండను బాపసంభవుఁడ, నాపాపంబు లేపారుచీ
రూపంబై పలువేదనల్ పెనుప, నోర్పున్ నేర్పుఁ గోల్పోయి, ని
త్యోపాస్యున్ నిను వేఁడుకొందునిదె; సద్యోజాత! ఈకోపముల్
తాపంబుల్ శమియింపఁజేయు, మఖిలాత్మా! శ్రీత్రికూటేశ్వరా!

98. కరుణన్ రక్షణ, పోషణంబులిడి, యజ్ఞానంబుఁ బోఁద్రోచి, సం
సరణాబ్ధిన్ దరియించు సాధుజనసంసర్గంబు, భక్తిన్ నిరం
తరమున్ నిన్ను భజించు భాగ్యము భవత్సాయుజ్య మిమ్మర్థి దే
వర! దిక్కెవ్వరు నీవ తక్క!శ్రితకల్పా! శ్రీత్రికూటేశ్వరా!

99. అధికారంబు, ధనంబు, జాతిమత విద్యాహంకృతుల్వీడి, స
న్నిధులౌసాధులఁగూడి, లోకమభినందింపన్ బ్రశస్తంబులౌ
విధులన్ బూని చరింత్రు సజ్జనులు; తద్విజ్ఞాన సంపత్తి ఁజి
త్సుధలన్ గ్రోలుచు ధన్యులౌదురు ముముక్షుల్; శ్రీత్రికూటేశ్వరా!

100. దురహంకారులు దుష్ట మానసులు ప్రొద్దుల్పుచ్చఁజింతించుచుం
దురు వేరొక్కరు కార్యభారవహులైదోఁగంగ, నెవ్వారి మె
చ్చురు, దైవంబును విశ్వసింప, రెపుడున్స్వార్థైకచిత్తంబుతోఁ
బరహింసారతులైన పాపకరణేప్సన్! శ్రీత్రికూటేశ్వరా!

101. వినతిన్ విన్నపమాచరింప వినవో?, వీక్షింపవో? వేఁడినన్;
బునరుక్తుల్ గనఁబోవరుత్తములు సంపూర్ణానురాగంబునన్
మనమున్ మాటయు నేకమై మనుగడన్ మర్యాదలన్ బూను, భా
వనలన్ దీవనలిచ్చి కావుమనుకంపన్, శ్రీ త్రికూటేశ్వరా!

102. "నీ సంకల్పము మంచిదైన నభినందించున్ మహాదేవుఁడి
చ్ఛా సంపూర్తి నొసంగు నిక్కమ"ని వాత్సల్యంబుతోఁ జెప్పిరీ
శా! సత్సంగతి సంప్రదాయవిదు లాశాస్త్రోక్తి నేఁ గొల్తునా
శాసింపన్ నినుఁ గోరుకొంచు; బుధరక్షా! శ్రీ త్రికూటేశ్వరా!

103. ఇల, సచ్ఛిష్యులకిచ్చు విద్య లనయంబేపారు నాకల్పవృ
క్ష లతారీతులపత్ర పుష్ప ఫలముల్ ఛాయా సమృద్ధిన్ శ్రితా
వళి కర్పించుచు, ధర్మతోయములొగిన్ వర్షింపఁ దోడౌను, ని
చ్చలు వాతావరణాది రక్షణముఁ గాంచన్; శ్రీత్రికూటేశ్వరా!

104. కోపావేశమునన్ వివేకధనమున్ గోల్పోయి, దర్పంబుతోఁ
బాపంబుల్ సలుపన్ విషాదములు, శాపంబుల్ ప్రవర్తిల్లు సం
తాపంబుల్ శమియింప సన్నిధిని సంధానింపవే సత్కృపన్
నీ పాదంబులు పట్టి వేఁడెదను తండ్రీ! శ్రీత్రికూటేశ్వరా!

105. నిన్నేఁగొల్చెద భక్తవత్సల! భవానీవల్లభా! జ్ఞానసం
పన్నంబై తనరారునీపదము లాపద్వారిధిన్దాటఁగా
సన్నౌకాస్థితి, దుర్విపన్నులకు రక్షాసాధకంబౌధృతిన్;
నన్నున్ మన్ననఁగావవే సుజనమన్దారా! త్రికూటేశ్వరా!

106. ఆరాటంబధికంబుగా బ్రతుకు పోరాటంబుగామారు, ని
స్సారంబీ జగమెల్లఁగల్ల, తెలియన్ సర్వంబు నీలీల, లా
ధారంబీవ సమస్త విశ్వమునకున్, ధర్మంబుఁబాటింపఁ గా
మారీ! ధీర గుణమ్ము నిమ్ము; జితమోహా! శ్రీత్రికూటేశ్వరా!

107. శివతత్త్వంబు, సుబోధమై, సుగమమై, శ్రేయస్కరంబై, వివే
క విభూతిప్రదమై, విముక్తి ఫలమై, కళ్యాణ సంపద్గుణా
ర్ణవమై, ఆశ్రిత కల్పకంబగుచు సంరక్షించుఁ గారుణ్యదృ
ష్టి విలోకించుచు సాధుపోషణనిరూఢిన్; శ్రీత్రికూటేశ్వరా!

108. క్రమమున్ దప్పక నీపదంబు లెదనారాధింతు నీవే ప్రపం
చముగా నెంచుచు నేఁబ్రదక్షిణ నమస్కారంబులన్ గొల్తు ని
త్యము నాత్మార్పణబుద్ధి నీదగుమహత్త్వంబున్ బ్రబోధించు గ్ర
న్థములన్ బాడుచు బంధనంబులెడలంగా; శ్రీత్రికూటేశ్వరా!

109. వరమౌ భౌతికసంపదందలఁచి గర్వంబందరాదెన్నఁడున్!
బరమోత్కృష్టము దైవ, మావిధిని గెల్వన్ జాలరెవ్వారుఁ బె
న్వరదన్ వైతసివోలె గాలమెదురైనన్ నమ్రుఁడైనిల్చి ధై
ర్యరమన్ జెందఁడెజీవుఁడీప్సితములొయ్యన్; శ్రీత్రికూటేశ్వరా!

110. వగవంగా దగునే? గతాగతములన్ భావించి జీవుండు; దై
వగతిన్ మాన్పఁగలాడెవం? దరయ; నాపన్నప్రసన్నుండు స
ర్వగుఁడాశర్వుఁడెదిక్కు నిక్క మని మార్కండేయుఁడార్తిన్ భజిం
పఁగ నాయుర్విభవంబులీయవె; మహాత్మా! శ్రీత్రికూటేశ్వరా!

111. “భవరోగంబెడలించువైద్యుఁడ”ని విశ్వాసంబుతో, నిన్నవో
ద్భవునిన్ గొల్తురు యోగిపుంగవులెదన్ ధ్యానించుచున్, నిత్యమా
త్మవిదుల్ శాంతునిఁబంచవక్త్రుని దయార్ద్రస్వాంతునిన్దాంతు,జ్ఞా
నవిశిష్టున్, భగవద్వరిష్ఠుఁబరమానందున్; త్రికూటేశ్వరా!

112. అరుదైదోఁచు పతివ్రతాతిలక మాయార్యామహాదేవి, నీ
పరమౌదార్య మెఱింగి నీకరముఁ జేపట్టెన్; జగన్మాత, యా
కరుణామూర్తి యనుగ్రహంబునను నిన్గంటిన్ మహాదేవ! మీ
చరణంబుల్శరణంబులంటి! నతరక్షా! శ్రీత్రికూటేశ్వరా!

113. రోగంబుల్హరియించి దుఃఖముల నిర్మూలంబుఁ గావించునీ
యోగాభ్యాసము “నేనెబ్రహ్మ” మను వేదోక్తిన్ నిరూపించుచున్
రాగద్వేషములంతరించి, ముదమారన్ శ్వాసలే దోలలై
తూఁగాడన్గల ధ్యానమేనభిలషింతున్ శ్రీత్రికూటేశ్వరా!

114. జననంబాదిగ సౌఖ్యసంతతుల సంసారంబునన్ముగ్గి బో
నునఁ బడ్డట్టి మృగంబుగాఁ దిరుగుచుండున్ జీవుఁడేనాఁడు స్వా
త్మను భావింపఁడు విస్మృతింబడి మహామాయాప్రభావంబునన్;
నిను దర్శించుటయేయెఱుంగఁడుతపోనిష్ఠన్; త్రికూటేశ్వరా!

115. తనువున్ బ్రాణము లింద్రియంబులపటుత్వం బస్థిరంబౌట దు
ర్జను లూహింపక భోగబుద్ధి, విషయాసక్తింబ్రవర్తింతు, ర
ప్పునిదోషంబని చెప్పినన్వినరు, తద్వ్యామోహబంధంబులున్
దనవారందఱ కెగ్గు గాఁదలఁపరాత్మన్! శ్రీత్రికూటేశ్వరా!

116. ధ్యానంబాత్మకుశాంతి నిచ్చుచు మనోదౌర్బల్యమున్ బాపి, భూ
మానందంబు ఘటించు, జాతికుల విద్యావేష భాషావిభూ
షానీకంబు గణింప కందఱ కమూల్యంబైనయారోగ్య భా
గ్యానూనత్వ మొసంగు, నిన్దెలియఁగానై; శ్రీత్రికూటేశ్వరా।

117. గ్రహముల్ సాగ్రహవృత్తి వర్తిలుచు దుర్వారంబులైయుండనేఁ
డహమున్ వీడుచు వేఁడుకొందు జగదేకారాధ్య! నాపైనను
గ్రహమున్ బూనఁగ; భక్తవత్సల! కటాక్షశ్రీల మన్నించుచున్
మహమున్ గూర్పవె, శక్తిమత్తముఁడవౌమన్; శ్రీత్రికూటేశ్వరా!

118. మధువేజీవనమై సమస్త జలధుల్ మాధుర్యమున్ బంచగా,
మధువుల్ గూర్చుచు గోవులోషధులు స మ్మాన్యంబులైవర్ధిలన్,
విధువాతాతప సస్యముల్ మధురసోద్వేలంబులైయుండఁ ద
న్మధుమత్సంస్థితి మాకొసంగుము; మహాత్మా! శ్రీత్రికూటేశ్వరా!

119. శివమౌనీకృతియెన్న సర్వభువన క్షేమంకరంబై ప్రసి
ద్ధి వహించున్ నిగమాగమ ప్రణుతమై; దివ్యానుభూతి ప్రదం
బవు నీనామ మశేష పాపహరమై యానందమున్ గూర్చుఁ జూ
డవె నీపాపఁడఁ బ్రేమతోడ; శశిచూడా! శ్రీత్రికూటేశ్వరా!

120. అపరాధంబు లనంతముల్ సలుపునాయజ్ఞానమున్ద్రోచి, స
త్కృప మన్నింపవెదాసునిన్ మనుపవే; దీనావనోదార! నీ
దుపదారాధనతత్పరుల్ జనులు నిర్ధూతాత్మపాపౌఘులై
యపవర్గానుభవంబుఁగాంతు,రవిభాజ్యా! శ్రీత్రికూటేశ్వరా!

121. "భగవంతుండొకఁడే సమస్తజగముల్ పాలింపఁజాలింపఁజే
యఁగ సామర్థ్యము గల్గియుండు నణిమాద్వైశ్వర్య సంపత్తి, శాం
తగుణోపేతుఁడు దాంతుఁడాతఁ"డని వేదంబెన్నె, నిన్వేడెదన్
బ్రగతిన్ బ్రాభవమున్ బ్రశాంతి నొనగూర్పన్; శ్రీత్రికూటేశ్వరా!

122. "ద్వైతంబౌ భయహేతు" వన్న శ్రుతి సిద్ధాంతంబు సత్యంబగున్
ద్వైతాద్వైత విశిష్ట భావముల నద్వైతంబు శ్రేయంబు; వి
శ్వాతీతంబును, విశ్వరూపమును విశ్వాంతర్గతంబైన త
చ్చైతన్యంబొకఁడంచుఁదోచు; నవినాశా! శ్రీత్రికూటేశ్వరా!

123. ప్రభలన్గట్టి ప్రపత్తి, భక్తతతిచేరన్వచ్చినిన్గొల్చు "మృ
త్యుభయత్రాతవు, జ్ఞానదాతవ"నుచున్; యోగప్రభావంబు నీ
విభవంబున్ వివరించు దివ్యకథలన్ వించున్, వినోదంబునిం
చు భవల్లీలలుఁగాంచుచున్ నిశిఁజరించున్; శ్రీత్రికూటేశ్వరా!

124. వెలనాఁడేలిన గొంకరాజు మొదలౌ విజ్జుల్ మహారాజు లి
మ్ముల వేయించిన దీపదాన శిలలున్ బోధించు నీయాలయం
బల ఆరేడుశతాబ్దులందును బ్రశస్యంబౌట; తత్పూర్వమే
వెలయన్ జేసె నెవండొపుణ్యుఁడు; యశస్వీ! శ్రీత్రికూటేశ్వరా!

125. గిరిపై బ్రహ్మకు విష్ణురుద్రులకుఁదత్కీర్తి ధ్వజస్ఫూర్తి సు
స్థిరమైయుండు త్రికూటముల్ మహితముల్ దీర్ఘంబులై వర్ధిలున్
పరమార్థంబుపదేశమిచ్చుచుఁబరబ్రహ్మమ్ముగాఁబొల్చు స
ద్గురుమూర్తిన్ నిను గొల్తు, రా ఋషులు సిద్ధుల్; శ్రీత్రికూటేశ్వరా!

126. సమ్మానం బవమానమేదయిన నీసంకల్పమౌనన్న స
త్యమ్మున్ నమ్మితిఁ; జంచలాత్ములయి, తద్ధర్మంబు మీఱంగ, సా
క్ష్యమ్మై సర్వముఁజక్కఁజేయవె? మహోగ్రంబైన క్రోధాగ్ని నా
శమ్మై పోవరె పాపబుద్ధు లహిభూషా! శ్రీత్రికూటేశ్వరా!

127. శివుఁడంచున్ భవుఁడంచు ఁబాపహరు నిన్సేవించు భక్తాళికా
యువు, నారోగ్యము, కీర్తి సంతతులు, నుద్యోగంబు భాగ్యంబుఁ గ
ల్గు, వివేకంబొనగూడు, శంకరుఁడ వెగ్గుల్మాన్పి కాపాడవే !
స్తవనీయంబు భవచ్చరిత్రము; గిరీశా। శ్రీత్రికూటేశ్వరా !

128. శరణన్నన్ గరుణించి కాచుదొర! విశ్వాసమ్ముతో నిన్ను నే
నిరతంబున్ స్మరియింతు, నీచరణసాన్నిధ్యంబుఁ గల్పించి శం
కరమౌరూపముతోడ దర్శనము గల్గన్, నీ మహత్తేజమం
దురమింపన్ వరమిమ్మునెమ్మది భజింతున్ శ్రీత్రికూటేశ్వరా!

129. ఈ దేహేంద్రియ చిత్తముల్ దెలియలే వెన్నండు నీయున్నరూ,
పాదివ్యత్వమెఱుంగలేరు సురలయ్యబ్జాసనాదుల్; మహౌ
జా! దూరంబుగ దీనతంబొగులు నాయభ్యర్థనల్దీర్ప రా
వే, దాక్షిణ్యముఁజూపవే, యభయమీవే; శ్రీత్రికూటేశ్వరా!

130. పరమంబౌట రహస్యమౌ, నదియు నాప్తశ్రేణికిన్ జెప్పరో
కరుణన్జూపరొ? తత్స్వరూపమును సాకల్యంబు; శ్రీతారకే
శ్వర! నిన్నున్ దెలియంగఁ బూర్ణమగు విజ్ఞానమ్ము నాకిమ్ము, ప్రే
మరసానందము సందడింపఁ; బరమాత్మా! శ్రీత్రికూటేశ్వరా!

131. పరులన్ వేడఁగ నుప్పుఁబప్పునొనగూర్పన్ గొప్ప; యీ నోపరె
వ్వరు నీలీల నుదారులౌచుఁ బరమైశ్వర్యంబు; సర్వేశ! పా
మరుఁడన్ నాయపరాధముల్ మఱచి ప్రేమన్ నన్ను మన్నించి, నీ
దరిఁ జేరన్గరుణింపవే! యభయదాతా! శ్రీత్రికూటేశ్వరా!

132. ధనమార్జించుట చాల దుఃఖము; ప్రయత్నంబొప్ప రక్షించుటిం
కను దుఃఖంబు, వ్యయంబునన్ గలుగు దుఃఖం, బస్థిరంబైన యా
ధనమెందున్ గడు దుఃఖవర్ధకము; ఛీ। తద్దాహమున్ దీర్చు జీ
వనమున్ గూర్చుము తాపముల్ సమసిపోవన్ శ్రీత్రికూటేశ్వరా!

133. పురముల్గాల్చి, పిశాచులన్గలిసి యబ్బ్బాదిన్ శరీరంబునన్,
గరళంబున్ గళమందుఁదాల్చి, పులితోల్గైసేసి, కాకోదరా
భరణంబుల్ ధరియించి, మిక్కిలి విరూపంబున్ బ్రదర్శించు దే
వర! నీవేకద విశ్వరూపుఁడవు; శర్వా! శ్రీత్రికూటేశ్వరా!

134. పగలున్రేలును, శీతముష్ణ, మిటు లీద్వంద్వంబు లెల్లన్ దలం
పగ నీలీలలె, సర్వలోక జనకా! పాపౌఘసంహారకా!
నిగమంబాగమముల్ భవన్మహిమవర్ణింపన్ సమర్ధంబులౌ
నె; గభీరుండ వనంతశక్తుఁడవు! తండ్రీ! శ్రీత్రికూటేశ్వరా!

135. నాదం బక్షరమై, పదంబు, రసపూర్ణంబైనవాక్యంబు నై
మోదంబున్ ఘటియించుఁ గావ్యమగుచున్ బోధించుఁ గర్తవ్యమున్
వేదంబుల్, నిగమాంతశాస్త్రములు నీ విద్యాస్వరూపంబు నా
వేదించున్, బరమార్థ తత్త్వము నిరూపించున్ ద్రికూటేశ్వరా!

136. మనలో భేదములేమియున్ గలుగ, వీమాయాస్వభావంబు నెం
తనివర్ణింతును, లోకసంగతుల, సత్యంబున్ వివేకింపనే
రని మోహంబెసగంగఁజేసి,యయథార్థంబున్ బ్రబోధించు జం
త, నిరోధింపవె! దీని త్రుళ్ళడఁచి; శాస్తా! శ్రీత్రికూటేశ్వరా!

137. భ్రమయౌదూరపుఁగొండనున్నుఁ, దరిఁజేరన్ మిట్టపల్లంబులే;
మమతల్ మానవతల్ ప్రసంగములలో మర్యాదవాక్యంబులే;
సమతాసిద్ధి, యసాధ్యమీజగమునన్ సంస్కారభేదంబుచే;
నమితానందము నిచ్చునీస్మరణ; మార్యా! శ్రీ త్రికూటేశ్వరా!

138. నీ నామంబుజపింపఁబాపచయముల్ నిర్మూలమైపోవు,"ప్ర
జ్ఞానంబ్రహ్మ" యటంచుఁదెల్పు శ్రుతివాక్యంబాత్మశోధింప, భూ
మానందంబు ఘటిల్లు, ధర్మగతి మోక్షాపేక్ష వర్ధిల్లు లో,
నీనా భేదమడంగు "తత్త్వ"ముగ శాన్తిన్; శ్రీత్రికూటేశ్వరా!

139. హృదయావేదన తీరుటెన్నఁడిక స్వామీ। నన్ను మన్నించి నీ
సదయాపాంగ విలోకనంబుల ననిష్టంబుల్ నివారింపవే;
పదముల్ పట్టి ప్రపత్తివేడుకొన సంబాళించు కారుణ్యమూ
ర్తి! దరిద్రున్ నను గావవే; విశదకీర్తీ! శ్రీత్రికూటేశ్వరా!

140. తరణోపాయము నీదు నామ మదిబాధామగ్న దీనాళికిన్
బరమైశ్వర్య కరంబు మోక్షదము నీపాదాంబుజధ్యాన, మ
క్షరమౌ బ్రహ్మకు నీకు నంకితము నాసాహిత్యమర్థిన్ గళా
భరణంబై యలరారఁదాల్పు, మవికల్పా। శ్రీత్రికూటేశ్వరా!

141. ఏ జన్మమ్ముల నేమి కర్మముల మున్నేరీతిఁగావింప, నా
కీజన్మమ్మున నిట్టి కష్టములొ? నేనీదుఃఖ కాంతార మం
దేజాడన్ దిరుగాడనౌ? శ్రితజనాభీష్ట ప్రదంబైన నీ
సౌజన్యంబునఁద్వత్పదంబిడు, ముమేశా! శ్రీత్రికూటేశ్వరా!

142. కనులన్ జూచియుఁజూడనట్లు, చెవులన్ గష్టంబు లెన్నింటినో
వినికూడన్ విననట్టులుందువు నినున్ విశ్వేశ్వరుండంచు! జా
టునులోకంబు; దయామయుండవయిచుట్టున్గోటగానుండి ర
క్షణఁగల్పింపవె క్రూరజంతువుల కక్ష్యన్; శ్రీత్రికూటేశ్వరా!

143. ఇరువంశంబుల పేరు నిల్పువనితావృత్తంబుఁగీర్తింపనౌ
వరుసన్ నీసతిఁబార్వతిన్ దలఁతుసౌభాగ్యస్వరూపంబుగా
పరతత్త్వానుభవంబునందొకటియై భాసించు దాంపత్య మ
క్షరమర్థంబునుబోలెనిత్యము! మహేశా! శ్రీత్రికూటేశ్వరా!

144. ఎన్నాళ్ళీ కలతల్ మనోవికలతల్ హేయంబుగాఁజూడకా
పన్నున్ నన్నుఁదలంపవే,? త్రివిధతాపంబుల్ నివారింపవే?
కన్నాకై కలకాలమీవుకరుణన్గాపాడఁగాఁజూడవే?
నిన్నే నమ్మితి నెమ్మదిన్ నిలుపుశాన్తిన్; శ్రీత్రికూటేశ్వరా!

145. తనదేహాత్మలకున్న భేదమరయన్ ధన్యుండు; సత్యంబుఁగా
నని నాఁడన్నియుఁగష్టముల్; సతతమంతర్బుద్ధి యోజింపఁదో
చును కాయంబిది పంచభూతమయమంచున్; బ్రాజ్ఞుఁడీమాయగె
ల్చును, బూర్ణంబగు బ్రహ్మమున్ దలఁచి కొల్చున్; శ్రీత్రికూటేశ్వరా!

146. బాలుండాటలఁబాటలన్ గడపు భవ్యంబైన బాల్యంబు; కాం
తాలోలుండయి యౌవనంబున నసర్థంబైనన ర్థాప్తికై
యాలోచించును; వృద్ధుఁడాతురతఁజింతాక్రాంతచేతస్కుఁడై
కాలక్షేపముసేయు; నిన్దలఁపఁడొక్కండున్ ద్రికూటేశ్వరా!

147. జననంబున్ మరణంబు వ్యాధిభయముల్ సంసార దుఃఖంబులున్
గనకుండన్ నినుఁగొల్చు భక్తులకు మోక్షంబిచ్చి, నిన్జేర్చి, మ
న్ననఁగాపాఁడఁగఁజాలు వేల్పవగునీనామంబు నానాల్క పై
ననదింపన్ గరుణింపు మాశ్రితుఁడఁదంద్రీ! శ్రీత్రికూటేశ్వరా!

148. పరమామ్నాయములున్ నుతింప, సకలైశ్వర్యంబుతోనొప్పు నీ
శ్వరరూపుండవు వీరభద్రుఁడవు నీసంబంధమున్ మాని, మ
త్సరులై ద్రోహముఁజేయు నాయధములన్ దండించి, ధర్మమ్ము, నా
దరమేపారగఁబ్రోవవే! త్రిపురహర్తా! శ్రీత్రికూటేశ్వరా!

149. నిలువన్ నేరవు కల్లబొల్లికబురుల్; నిత్యంబు సత్యంబె; లో
కులు కాకుల్ నిజమాపరాత్పరుఁడెఋంగున్ నీరుపల్లంపు భూ
ములలోనన్ బ్రవహించుఁ దథ్య, మనయంబున్ గర్వదుర్వారులై
మెలగన్ జెల్లునె? పాపకర్ములయి; స్వామీ! శ్రీత్రికూటేశ్వరా!

150. కోడీకుంపటిలేనిదే జగముమేల్కోఁబోవ, దాహారమే
జాడన్ బొందఁగఁజాలదన్న నుడులున్ సత్యంబె? నా కెప్పుడున్
దోడైయుండగనీవుగానిదెది యెందున్ లేదు; నాదుఃఖముల్
వీడన్ జూడవె; చంద్రచూడ! కరుణాబ్ధీ! శ్రీత్రికూటేశ్వరా!

151. సత్యంబున్ శివమౌట సుందరము నీస్వాంతంబు నిన్జేరఁగాఁ
బ్రత్యామ్నాయ పథంబు లేదరయదేవాఁ భక్తిగాకాత్మ దౌ
ర్గత్యంబున్ గన నీక హృద్గుహవెలుఁగన్ జేయు జ్యోతి స్వరూ
పా! త్యాగంబు సమాశ్రయంబెగతి; యప్పా! శ్రీత్రికూటేశ్వరా!

152. జగమేనాటక, మిందు సంఘటితమౌ శత్రుత్వ, మిత్రత్వ, ముల్
తగ సంకల్పిత పాత్రలన్ గలుగునుల్లాసంబు, దత్తద్రసా
పగలందేలఁగ; సూత్రధారి! కథఁద్రెంపన్, బెంపఁగాజాలు దె
వ్వగఁజేయంగలవో ముగింపుఁదెరదింపన్; శ్రీత్రికూటేశ్వరా!

153. నినుఁజింతింపఁగఁబూనుచోఁదొలఁగు సందేహంబు లంతంత; "న
మ్మినవాఁడున్ జెడఁడె"న్నఁడన్న నుడులన్ మేలెంచి, సేవించు భ
క్తుని రక్షించిన కాలకాలుఁడవు; సంస్తుత్యంబు నీసజ్జనా
వన దీక్షావిధి, మంగళప్రదముదేవా! శ్రీత్రికూటేశ్వరా!

154. మాటల్కోటలు దాటు, ఁజేఁతలు గణింపన్ రిత్తలై తోచుఁ బో
రాటంబూని జగంబులన్ గెలుచు నారాటంబుతో, క్షేమపుం
బాటల్ వీడిచరించుఁ బాపమొనరింపన్జూచు; దౌర్జన్యమున్
బాటించున్; ఁ దటియయ్యెశూలముఁగదల్పన్; శ్రీ త్రికూటేశ్వరా!

155. గ్రహముల్ సాగ్రహ వృత్తి వర్తిల ననేకంబాపదల్గల్గు న
న్వహమున్ దద్గ్రహతారకాతతులు నీయాజ్ఞా నిబద్ధంబులై
మహమున్ గూర్చు జగంబులందు గురుసంబంధంబుతో నీయను
గ్రహమున్ జూపవె "జ్యోతిషాంపతి" దయార్ద్రా! శ్రీత్రికూటేశ్వరా!

156. జయమౌ నాయుధముల్ ధరించి రిపులన్ శాసించు నీశక్తి యా
శ్రయులన్బ్రోచు సమర్థతన్బొలుచు, సర్వశ్రేయముల్ గల్గఁగా;
భయముల్ వాపి, దయన్ శుభంబు లొనగూర్పన్ నీవె దిక్కంచుని
శ్చయమైయుండెడు జ్ఞానమిమ్ము; శ్రుతిభూషా! శ్రీత్రికూటేశ్వరా!

157. మౌనధ్యానములందు జ్ఞానమెనయన్ మార్గంబు సూచించి, బ్ర
హ్మానందానుభవ స్వరూపమును వ్యాఖ్యానించు నీమూర్తి, యా
త్మా నాత్మైక విచారమున్ గఱపు, సత్యాన్వేషిగాఁజేయు, న
జ్ఞానాంభోధిఁదరింపఁజేయు, గురురాజా! శ్రీత్రికూటేశ్వరా!

158. ధ్రువముల్, దీన జనావన ప్రవణముల్, రుద్రానువాకంబుతో
స్తవనీయంబులు నీపదంబు, లనుసంధానింతుఁజిత్తంబు నం
దవమానాగ్ని శమింపఁజేయు, మనయంబధ్యాత్మ యోగంబునన్
భవమున్బాపు, ముదారబుద్ధి; శ్రితకల్పా! శ్రీత్రికూటేశ్వరా!

159. చైతన్యంబొకఁడీ సమస్త జగముల్ సంసృష్టిఁగావించి, త
చ్చేతో మోదమెలర్పఁబెంచు, ఁ దనలోఁజేర్చున్ వినోదంబుగా;
ఆ తానే సకల ప్రపంచమగుచున్ వ్యాపించు, దీపించు స
ర్వాతీత స్థితి, నద్ది నీవగుట సత్యంబో, త్రికూటేశ్వరా!

160. పరుగుల్ వెట్టుచుఁబందెముల్ సఱచుచున్, బంతంబులన్ బూనుచున్,
జిరకాలంబు విరోధమున్ నెఱపుచున్, జీవంబులన్ దీయుచున్,
బరపీడా పరతంత్రులై పరగుచున్ బాపప్రవృత్తుల్ చరిం
తురు; కాపాడవె సజ్జనాళి దయనెందున్; శ్రీత్రికూటేశ్వరా!

161. ఘనవిద్యాధన గౌరవ ప్రబల సౌఖ్యంబుల్ వినోదంబులు
న్నను, వ్యర్థంబులె నిన్నెఱుంగఁగల విజ్ఞానంబు లేకున్న; సా
ధనమున్ సాధ్యము సిద్ధియున్గలుగ నాధారంబు నీవౌదు; చి
ద్ఘనమౌ నీదు విభూతు లద్భుతములాప్తా! శ్రీత్రికూటేశ్వరా!

162. తన విశ్వాసమెదైవమౌ ననెడుసిద్ధాంతంబు రూపింప, భ
క్తుని కోర్కెల్ నెఱవేర్చు పూన్కిఁ, గరుణన్ దుఃఖంబులన్ బాపి, ద
ర్శన భాగ్యంబున సర్వశక్తులదరన్ రక్షించు సర్వస్వరూ
పుని, సర్వేశ్వరు నిన్నుఁగొల్తు ననిశంబున్ శ్రీత్రికూటేశ్వరా!

163. మునుగావించిన, కర్మ సంచితముగా భోక్తవ్య, మీజన్మ మం
దున ఁ'ప్రారబ్ధముల'ైన కర్మతతు, లుద్యోగంబు, 'లాగామి' క
ర్మను, జన్మంబునుఁగల్గఁజేయును; స్వధర్మంబైన కర్మంబులెం
దునుదోడ్పై పురుషార్థముల్ నెఱపుచుండున్ శ్రీత్రికూటేశ్వరా!

164. వరమీ మానవజన్మ; మానవుఁడు సర్వప్రాణులందుత్తముం,
డరయన్ ధర్మము నాచరింపఁగల జ్ఞానాధిక్యసంపత్తిఁ దుం
టరు లాసత్య మెఱుంగ రీజగముతోడన్ బద్ధులై; దేహ మ
స్థిర, మధ్యాత్మ విదుండె ధన్యుఁడు; కపర్దీ! శ్రీత్రికూటేశ్వరా!

165. తన తప్పున్ గన, కొప్పుఁగా ఁదలఁచు, చద్దానిన్ సమర్థింప జూ
చిన లోకమ్ముక్షమింపదెన్నడు, విమర్శించున్, విగర్హించు; రా
ముని ఁగీర్తించుచు, రావణున్ దెగడదే; పూర్వార్జితంబౌ తపం
బును, దేజంబు హరించు నేరము, స్వయంభూ! శ్రీత్రికూటేశ్వరా!

166. ఎటులో కాలము వెళ్ళఁబుచ్చినటు లయ్యెన్ జీవితం, బిందు, సం
కటముల్ పెక్కులు సంఘటిల్లె ఁదొలఁగన్గా నాత్మలో నిన్ను ఁగొ
ల్చుట, విశ్వాత్మునిగా ఁదలంచుట, గుణస్తోమంబు స్తోత్రంబుఁజే
యుట, భక్తిన్ భజియించు టేనెఱుఁగ నయ్యో! శ్రీత్రికూటేశ్వరా!

167. పదమో, పాటయొ, గేయమో, వచనమో పద్యమ్మొ, గద్యమ్మొ యౌ
హృదయామోదముఁగూర్చు తత్రచన లేయేరూపముల్ దాల్చినన్
బదిలంబై పదికాలముల్ నిలుచు విద్వత్ ప్రస్తుతిన్ గాంచి, శా
రదకున్ భూషలు, జ్ఞానవాహిను, లుదారా! శ్రీత్రికూటేశ్వరా!

168. భువనాధీశ! నినున్భజించు విషయంబున్ జెప్పు వేదంబు, లీ
రవిరూపంబున దర్శనంబొసఁగి యారాధ్యుండవైయుండి; శా
స్త్రవిదుల్, పండితు, లెల్లఁబామరులు, నిత్యశ్రామికుల్, స్త్రీలు, జ్ఞా
నవిహీనుల్ కనఁగా వెలుంగుదు; తమోఘ్నా! శ్రీత్రికూటేశ్వరా!

169. 'సహకారంబ'న మొండిచేయొసఁగు సంస్కారప్రహీణుండు; దు
స్సహమౌ దుర్విషమాత్మఁదాల్చి, జగముత్సాహంబుతోఁ గాచి, త
న్మహనీయ స్థితి నిల్పినట్టి నిను సంభావింతు; నర్థింతు నీ
సహనంబున్ సహకారసంపద మనీషన్; శ్రీత్రికూటేశ్వరా!

170. విమలంబై వివిధాగమ ప్రణుతమై విద్వద్విభావ్యంబు నై
తమమున్ బాపుచు నాత్మలో వెలుఁగు చైతన్యంబు దర్శించు యో
గము, నాకిమ్ము దయాపయోధివయి; నిర్వ్యార్థింతుఁ బాదంబులం
టి, మహామాయ ఁ దొలంగఁజేయ, శరణంటిన్; శ్రీత్రికూటేశ్వరా!

171. "ఉపకారైకఫలంబు స్నేహ"మన నత్యుత్సాహ సంపన్నులే
నెపమున్ మోపక, యెట్టి కష్టముల నేనిన్ దోడునీడౌచు సా
యపడన్ దక్షులు, నాప్తబంధువులు, నాకాత్మీయతంబంచి ర
చ్చపుఁబ్రేమన్ జయమున్ శుభమ్మొసఁగ నిచ్చుల్; శ్రీత్రికూటేశ్వరా!

172. శ్రుతులున్ శాస్త్రములున్ బురాణములు సంస్తుత్యుండ వీవంచు స
ద్గతి బోధించు; మహేశ్వరా! స్మరణచే జ్ఞానంబు సిద్ధించు సం
గతులారోక్తులఁ దేటతెల్లమగు; ప్రజ్ఞా శ్రీ స్వరూపున్, మహా
ద్భుత తేజున్, నతకల్పభూజు, నినుఁగొల్తున్ శ్రీత్రికూటేశ్వరా!

173. ఎవరో యెట్టులో చేయుదోసములకింకెవ్వారలో బాధ్యులం
చు వివక్షించుట చెల్లునే? చెవుల వించున్, గన్నులన్ జూడనే
రవు న్యాయాలయముల్; నిజంబెఱుఁగ సర్వజ్ఞా! సమర్థుండవౌ
దువు; సాక్ష్యంబది చెప్పుమిప్పుడు, తరింతున్; శ్రీత్రికూటేశ్వరా!

174. పలుకుల్చాలవు, పోల,వూహలును నిర్వర్ణింపఁ,జిత్రింపఁ; జేఁ
తలకున్ దక్కవు, చిక్కవేబలుములన్; ధర్మైక గమ్యంబు, ని
స్తులమౌచున్ త్రిజగంబులందు వెలుగొందున్ నీదు తేజంబు, భ
క్తులకున్ జ్ఞానము, ముక్తి సంపద లొసంగున్; శ్రీత్రికూటేశ్వరా!

175. పగలున్ సంధ్యలు రేలు, నీకనులుగా,ఁ బాపంబుఁ బోఁద్రోచి, య
న్నగత ప్రాణుల ఁబ్రోచునంగములు, విఘ్నంబుల్ నివారించి దే
వగణంబున్ బరితుష్టినోముబల మాపన్న ప్రసన్నం బుదా
రగుణంబెన్నగ సాటిరారితరు, లౌరా! శ్రీత్రికూటేశ్వరా!

176. "పనియే దైవము"గా ఁబ్రపత్తినొనరింపన్ భద్రముల్ కల్గునం
చు నిరూపించిరి సూక్తి రత్నములు సంస్తుత్యంబులై భాసిలన్;
అనృతంబాడుచు ద్రోహచింతనము,ఁజేయన్ దైవమే సాక్ష్యమి
చ్చును; దానెయ్యది కోరు నయ్యది లభించున్; శ్రీత్రికూటేశ్వరా!

177. శివుఁడే సద్గురుఁడౌచు, శిష్యతతి కాశీర్వాద సంపత్తి బు
ద్ధివివేకంబు లెసంగు విద్య లనుభూతిన్ జెప్పి, మంత్రంబు ల
ర్థవిశేషంబులు బోధఁజేసి, జనిసార్థక్యంబుఁ గల్పింప నా
త్మవిచారంబొనగూర్చుయోగమిడుఁబ్రేమన్; శ్రీత్రికూటేశ్వరా!

178. ప్రజలన్'గంటికి రెప్ప'గా సతతమున్ బాలించు భూతేశ! దే
హజముల్ మానసికంబులౌ రుజలు, మోహావిష్టునిన్ జేయగా
నిజ ధర్మంబులుఁ బుణ్యకర్మచయముల్ నేఁజేయగాఁజాలనై
తి, జవమ్మున్ బలమిమ్ము; వైద్యవర! ప్రీతిన్ శ్రీత్రికూటేశ్వరా!

179. పరపీడాపరులస్త్రశస్త్రములుసంపాదించి, లోకంబు ల
ల్లరిపాల్జేసిరి రాక్షసాధములు; పోల్పన్ జాలిరీనాటి ము
ష్కరు లవ్వారల, నర్థమంగబలమున్ సాధించి, వేధింతు; రా
దరమున్ జూపవె ఆశ్రితావన సమర్థా! శ్రీత్రికూటేశ్వరా!

180. నిధులున్, సౌధములున్, ప్రజాబలములున్ దేశాధికారంబు లె
వ్విధినున్నన్, విధిచేతి కీలుబొమ లీవిశ్వంబు నందెల్లరున్
అధినాథుండవు నీవు; నీమహిమ గర్వాంధుల్ గనన్‌జాల, రా
తృధృతిన్ భక్తినిధుల్ గ్రహింతు రఖిలాత్మా! శ్రీత్రికూటేశ్వరా!

181. శివనామ స్మరణంబు క్లేశహరమై శ్రేయంబులన్‌గూర్చు నా
యువు నారోగ్యము భోగభాగ్యములు నుద్యోగంబు సద్యోగవై
భవమున్ గూర్చుచు, నిర్వికల్పమగు నద్వైతానుభూతిన్ ఘటిం
చు, వివేక స్థిరధర్మ వర్తనము నిచ్చున్ శ్రీత్రికూటేశ్వరా!

182. నీకైవందనమాచరింతు దయతో నీవాఁడనేనంచు, నన్
జేకొమ్మీశ్వర! వేద శాస్త్రములు నిన్‌జ్యేష్ఠుండు, శ్రేష్ఠుండనున్
శ్రీకంఠా; బహిరంతరంగముల సుశ్రీమీఅనిండారి వి
శ్వాకారంబున వెల్గు నిన్గొలుతుఁ; బూజ్యా! శ్రీత్రికూటేశ్వరా!

183. అవునా? కూటికిగుడ్డకీ కవితలయ్యా! అర్ధమా? భూరిగౌ
రవమా? యెందుఁవిందు, రెండటిని మార్పంజాలు నీవిద్యయం
చెవరేరీతి విమర్శనల్ సలిపి నన్నెబ్భంగి నిందించినన్
భవదారాధనగా రచింతు రసరూపా! శ్రీత్రికూటేశ్వరా!

184. తరువుల్ మానవజాతికిన్ గురువులై ధర్మంబు బోధించు, జీ
వరహస్యం బుపదేశమిచ్చు; ఫలముల్ బత్రంబు లున్‌బూవులై
పరమేశవ్రత పూజన క్రతువులన్ భక్తిన్ సమర్పించు శ్రీ
కరమౌ ద్రవ్యము లగ్నిహోత్రములుగాగన్, శ్రీత్రికూటేశ్వరా!

185. పాపంబుల్, తమ పాలిశాపములు; తాపంబుల్ ప్రకల్పించు దు
ర్వ్యాపారంబులు, దుష్టచింతనలు దుర్వ్యామోహ దుశ్శీలముల్;
నీపాదాంబుజముల్ భజించు సుకృతుల్ నిర్ధూత పాపౌఘులై
యాపద్వారినిధుల్ తరింతురభిగమ్యా! శ్రీ త్రికూటేశ్వరా!

186. జననంబాదిగ జీవులెల్లర కవిశ్రాంతంబుగా నేదియో
పనిగల్పించుట సృష్టిలక్షణము, నిల్వండేక్షణంబెవ్వడున్;
మునుదాఁజేసిన పాపపుణ్యఫలమున్ భోక్తవ్యమైయుండుఁగా
వున నిష్కామముగా నొనర్చు పనియొప్పున్; శ్రీత్రికూటేశ్వరా!

187. దయకున్ దావలమీ వటన్న శృతి సత్యంబంచు నేనెంచియ
వ్యయునిన్ స్థాణుని, వీతరాగుని,విరూపాక్షున్ హరున్ నిన్ను నా
రయ సంకల్పము ఁజెప్పుకొందు, "నవునా, రమ్మంచు" వేబిల్వవే,
భయముల్ బాధలు దీర్చియక్కునను జేర్పన్; శ్రీత్రికూటేశ్వరా

188. ముదమున్‌గూర్పఁగ సజ్జనాళి హృదయంబుల్ తద్రసోద్దీప్తి దో
హదమున్ జేయుచు నాదమున్, బదము, నాట్యంబున్ బ్రవర్తించు, న
య్యది సర్వంబును ముక్తిదాయకుని నిన్నర్చించు మార్గంబయౌ;
నదులెల్లన్ దుదిఁజేరు సాగరములోనన్ శ్రీత్రికూటేశ్వరా!

189. గురుమూర్తిన్ జిరభక్తిఁ గొల్చుచు మదిన్ గోర్కెల్ నిరోధించి యం
దరిలోనన్ బరమాత్మరూపమగు చైతన్యమ్ము "సోఽహ"మ్ముగా
నరయన్ జాలిన సాధకుల్ విబుధసేవ్యంబైన నీధామ మ
క్షరసంస్థానముఁ జేరరే; పరమహంసా! శ్రీత్రికూటేశ్వరా!

190. ధనమేమూలము జీవయాత్రకుఁ బ్రభూతంబైనయాయర్థమె
ల్లను విశ్వేశ్వర నీవిభూతి; కనజాలందద్ది దుర్బుద్ధి! చె
ప్పిన యాలింపఁడు, చేతి కందినది తద్విత్తంబుఁగా విఱ్ఱవీ
గును; సర్వస్వము నీదిగానెఱుఁగఁడజ్ఞుండై; త్రికూటేశ్వరా!

191. జననంబాదిగ షడ్వికారములు శాస్త్రజ్ఞాన సంపత్తి కం
దనివైయుండుట, శాశ్వతుండవగు నిన్ దర్శింప యత్నించి, తో
చిన విశ్వంబున నున్న దంతయును విశ్లేషింప నీలీలగాఁ
గన వేక్షించిరి తత్త్వవేత్త లనురక్తా! శ్రీత్రికూటేశ్వరా!

192. పరులన్‌గోరగఁబోవ, కాత్మధృతి నిర్వర్తించు ధర్మంబు, ల
బ్బురమౌ సత్ఫలితంబు లిచ్చు, పరమామోదంబు ఁజేకూర్చుఁద
త్త్వరహస్యంబెఱుగంగఁజేయు నఖిలార్థంబుల్ ప్రసాదించుశం
కరునిన్ నిన్ను భజించుటౌనది! మృడాఖ్యా! శ్రీత్రికూటేశ్వరా!

193. జడమౌనీజగమాత్మ యోగమును సంసారంబు గానెంచు నె
న్నడు; గంగా, గిరిజాధవుండు భవుఁడన్ నామంబుసంకేతమై
ఇడయున్ బింగళయున్ సుషుమ్నయనఁగానేపారుటన్‌దెల్పు, న
య్యెడనానందము తాండవించునెద; యోగీశా! త్రికూటేశ్వరా!

194. కనులున్‌జాలవు నిన్ను ఁజూడ, నుడువన్ గష్టంబు నీరూపు, ఁజి
ద్ఘనునిన్ నిన్నుఁదలంప మోదమొదవున్; దాదాత్మ్యభావంబునన్;
మనసేవృత్తియులేక, నిశ్చలమగున్, మాయల్‌విసర్జించుచున్;
మునునేనెన్నఁడెఱుంగ నిట్టి విభవంబున్ శ్రీ త్రికూటేశ్వరా!

195. తనకున్‌మేలుఘటింపఁ గీడుఁదలఁచున్, దర్పంబుతోడన్ సనా
తనధర్మమ్మును లెక్కసేయఁడెద సత్యంబున్‌వివేకింపఁడెం
దు, నియంత్రించుచు సాధుజీవనుల, నుద్ఘోషింపగాఁజేయు ధూ
ర్తుని దండింపవె దుష్ట గర్వదురితాత్ము, శ్రీత్రికూటేశ్వరా!

196. తనలో వెల్గునఖండతేజమును సందర్శింపఁగాఁజేయు సా
ధన దీపజ్వలనంబు జ్ఞాననిధు లాదర్శంబుగాఁదీర్చిచూ
పిన సన్మార్గము; నీస్వరూపమెదభావింపన్ శరణ్యంబు; ర
క్షణఁగల్పింపగఁవేడుకోలు; స్థిరతేజా! శ్రీత్రికూటేశ్వరా!

197. పతిసర్వస్వముగాఁదలంచు సతియున్, భక్తిప్రపత్తుల్ వెలా
ర్చు తనూజుల్, సతియర్ధభాగమగునంచున్ గౌరవంబిచ్చును
న్నతులౌపూరుషులున్న మీ సదనమెన్నన్ శ్రేష్ఠమైయుండు; సం
స్కృతికిన్‌మూలము తత్ప్రవర్తన; యశస్వీ! శ్రీత్రికూటేశ్వరా!

198. కని, పోషించిన తల్లిదండ్రులఁగృతజ్ఞత్వంబు తోఁబ్రోచి, శి
ష్యుని, విద్యావినయంబులేర్పడఁ బ్రకృష్టున్ జేయు నాచార్యుఁ గొ
ల్చి, నిసర్గంబగు వృత్తిఁజేకొని నినున్ సేవించు ధన్యుండు పా
వనమౌ జీవన భాగ్యమొందు గురుదేవా! శ్రీత్రికూటేశ్వరా!

199. కనవో? దుస్థితి, నామొఱల్‌వినవొ? వేఁగాపాడగారావొ? కా
ళ్ళను మ్రొక్కంగను స్పర్శ యేర్పడదొ? సంలాపంబులన్‌దేర్చి మా
ర్గాని నీయక్కున ఁజేర్పవో దిగులుదీరున్; బంచతన్మాత్రలే
పని సాధింపగనోపు? నన్మనుపుమప్పా? శ్రీత్రికూటేశ్వరా!

200. కవికౌ నక్షరమాయుధం బవని సంస్కారంబు నేర్పింపఁగాఁ
గవికౌ నక్షరమౌషధంబెలయు రోగంబుల్ నివారింపఁగాఁ
గవికౌ నక్షర మర్ధపుష్టి రసవత్కావ్యంబు సృష్టింపఁగాఁ
గవికౌ నక్షర మర్చనాసుమ, మనర్ఘా! శ్రీత్రికూటేశ్వరా!

201. పరికింపన్ "దలిదండ్రు లందటికిలన్‌బ్రత్యక్ష దైవంబు"ల
క్షర సత్యంబు; ప్రదక్షిణంబును, నమస్కారం బభీష్టంబులి
చ్చు రహస్యంబు గజాననుండు నిజమంచున్‌జూపె విజ్ఞానియై
పరమోత్కృష్టము తత్ప్రభావమని చెప్పన్; శ్రీత్రికూటేశ్వరా!

202. ప్రణవార్థంబు సమగ్రమున్ దెలుపు సత్పాండిత్య శౌండీరుఁడై
ప్రణుతింపన్‌బడె సర్వలోకముల సుబ్రహ్మణ్యుఁడాచార్యుఁడై
క్షణమాత్రంబునఁదారకున్‌దునిమె నుత్సాహంబుతో దేవతా
గణముల్ మేలన, నీసుతుండు శ్రితరక్షా! శ్రీత్రికూటేశ్వరా!

203. ఎవరున్నారిట నీవుకాక, మమతాహీనప్రపంచాన, ను
న్నవి, ముందున్నవి, మీదవచ్చునవి గణ్యంబౌనె నీకన్న, న
మ్మవు, మానాన్నవు, సద్గురుండ, వభిరామంబైన నీధామమం
ది, వినోదించు దినంబు లెన్నఁ డురుకీర్తీ! శ్రీత్రికూటేశ్వరా!

204. దేహంబస్థిర మింద్రియంబులు మనోధీశక్తు లంతంతలే
యూహాపోహల కందకుండు నెదలో నుద్విగ్నతన్బెంచి, సం
దేహంబయ్యెడు జీవనప్రకృతి; విద్వేషాగ్ని చల్లార్చి ,స
త్యాహింసల్ పెనుపొందు శాంతిపథమిమ్మా! శ్రీత్రికూటేశ్వరా!

205. తినుచో, సంతతిఁగాంచుచో, నిదుర, భీతిప్రీతులన్నింటియం
దును ప్రాణిక్రియలెన్న నొక్క విధమై తోఁచున్; విచారింపఁగాఁ
దనబుద్ధీంద్రియవృత్తిచే నధికమౌ స్థానంబు సాధించె జీ
వన రంగంబున మానవాళి బుధసేవ్యా! శ్రీత్రికూటేశ్వరా!

206. అధికారం బొనగూర్చుదార్ఢ్యమును, ధైర్యం, బాత్మవిశ్వాస; మ
య్యధికారంబు పరోపకారులకు విఖ్యాతిన్ బ్రసాదించు న
య్యధికారంబు ప్రజాభిమానధనమున్ బ్రాప్తింపగాఁ జేయు న
య్యధికారంబు భవత్ప్రసాదమగునయ్యా! శ్రీత్రికూటేశ్వరా!

207. సాహిత్యంబు రసాయనంబు, మదికిన్ స్వాస్థ్యంబుఁజేకూర్పఁగా
సాహిత్యంబు సుధాపయోధి, కృతినాస్వాదింప మాధుర్యమున్
సాహిత్యంబు ప్రబోధ సంహిత, సుసంస్కారంబు రూపింపఁగా
సాహిత్యంబు జగత్ప్రదీపశిఖయౌస్వామీ! త్రికూటేశ్వరా!

208. ఈదేహంబొకగేహ, ముజ్జ్వలముగా నిందాత్మ తేజంబు(దీపంబు) స
మ్మోదంబావహిలన్ వెలుంగుసతతంబున్ జ్ఞానసర్వస్వమై;
ఆదీపం బిలుచక్కబెట్టుకొనయోగ్యంబప్రమత్తంబుగా;
లేదా? చీకటి పాలగున్ గలుషపాళిన్! శ్రీత్రికూటేశ్వరా!

209. జగమందున్ జగడంబు లందుగెలువన్ సామర్థ్యమున్ లేక నే
భగవచ్ఛక్తిని వేడుకొందు నెద సర్వస్వంబు నీవై యస
త్యగతుల్ మాన్పుచు నంతరాత్మలఁబ్రబోధంబందఁగాఁజేయ, నిన్
ద్రిగుణాతీతుని, సత్యధర్మరతుఁబ్రార్థింతున్! ద్రికూటేశ్వరా!

210. లోకాధీశ్వరు నేవిధంబునను గొల్తున్ నిన్ను; నాస్వామివౌ
నీకేమిత్తుఁగృతజ్ఞతల్ తెలుపఁగా, నీసృష్టిలోనుండు నీ,
రాకుల్, పూలు, సుగంధముల్, ఫలము, లాహారంబుఁ, దాంబూలము
న్నాకోశంకర! భక్తి తృప్త! ధృతగంగా! శ్రీత్రికూటేశ్వరా!

211. ప్రకృతిన్గూడిన జీవుఁడీజగతి సంబంధంబు తోఁజావుపు
ట్టుకలన్ గ్రుమ్మరుచుండు; నాతఁడెస్వరాట్టున్జేరయత్నించుచో
వికృతుల్ బాసి విచారముల్ గడచి సంవిద్రూపుఁడై భాసిలున్,
బ్రకటంబౌనిది జ్ఞానముద్రపరమార్థంబై; త్రికూటేశ్వరా!

212. స్థిరమౌఁజిత్తములేదు, సంపదలకున్ క్షేమంబులేదెన్నఁడే
ని, రుజాక్రాంతముదేహ మింద్రియతతుల్ నిస్సత్వమైతోచు, జ
ర్జరితంబైనది వాక్కు గద్గదికమై, సాధింపఁగా నేదియౌఁ?
బరతత్త్వానుభవంబుజీవునకలభ్యంబో? త్రికూటేశ్వరా!

213. పోరి, సంహారకుఁడైన వానిఁగొలువన్ బుణ్యంబులేదెన్నఁడే
పురుషార్థంబునుదక్కదంచుఁగుమతిన్ బోధించువారైన, నీ
దరిఁజేరన్దుదినంగలార్తురెద నీ దాక్షిణ్యమునన్ గోరి, స
త్వరమేబంధములూడ్చిపుచ్చగ; సమాత్మా!శ్రీత్రికూటేశ్వరా!

214. శివలీలానివహంబునన్గలుగు వైశిష్ట్యంబు వర్ణింపనే
రవుమాటల్, మనసూహఁజేయనసమర్థంబన్న వేఁతెన్ననే
ల? వివేకుల్సకలంబు నీమహిమగాలక్షించి, విశ్వేశ ! త
త్త్వవిచారంబున నిన్నెఱుంగుదురు; దివ్యా ! శ్రీత్రికూటేశ్వరా!

215. అనుమానంబె పిశాచమై మనమునందజ్ఞానమున్నించి, మం
చిని గుర్తించని స్థాయికిన్ దిగుచు; విచ్ఛిన్నంబుఁగావించు శాం
తిని; లోకాన, భిషగ్వరుల్ గలరొకోనీకన్నలోనున్న దు
ర్గుణముల్మాన్పగ సర్వరోగహరణాఖ్యుల్; శ్రీత్రికూటేశ్వరా!

216. జ్ఞానానంద మయంబుగాశ్రుతులు ప్రస్తావించు నీతేజమున్,
ధ్యానావస్థమహామునుల్ తలఁచిరాత్మన్ "దక్షిణామూర్తి"ఁగా!
నానారూపధరుండవై వివిధసందర్భంబులన్‌దోచు నీ
శానున్‌నిన్ను, శివుండవందు రవిభాజ్యా! శ్రీత్రికూటేశ్వరా!

217. నాసర్వస్వమునీవుగాఁదలఁచి, ధ్యానం, బాసనంబాదిపూ
జాసంపద్విధోపచారములనాసక్తిన్ సమర్పించి వి
శ్వాసంబేర్పడ భక్తిఁగొల్తు; సకలేశా ! నీవెదిక్కంచు, నా
యాసంబున్‌వెసమాన్పి రక్షణముఁజేయన్ శ్రీత్రికూటేశ్వరా!

218. గిరిపై కూటము, లాత్మసంగతుల సంకేతంబు లధ్యాత్మ బం
ధుర గ్రంథిత్రయ బోధకంబు, లఖిలస్తుత్యంబులైయుండుఁ ద
చ్ఛిరమందున్ వెలుగొందు నిన్దలఁప సుశ్రేయంబులున్‌గల్గు, ని
న్నరయన్ ముక్తిలభించు; యోగిజనసేవ్యా! శ్రీత్రికూటేశ్వరా!

219. శివరాత్ర్యుత్సవవేళ భక్తులు, తపస్సిద్ధుల్, మహాయోగు, లా
త్మవివేకుల్‌బుధు లార్షధర్మనిరతుల్ తత్త్వంబుఁజింతించుచున్
భవునిన్‌గొల్చుచు, నాత్మలోఁదలఁచుచున్ బంచాక్షరీ పాఠక
ప్రవణుల్ నీవ్రతమాచరింత్రు తమి భర్గా! శ్రీత్రికూటేశ్వరా!

220. సకలైశ్వర్యము నీవిభూతి! ధృతివిశ్వంబెల్ల వ్యాపించు నీ
కొక లేశంబు వికారమున్ గలుగ, దాత్మోత్కర్షు లీక్షింపనే
రకగర్వంబున విఱ్ఱవీగెదరు; సర్వస్వామ్యముల్ నీవె; పా
యకరక్షించుటె నీస్వభావము; దయార్ద్రా! శ్రీత్రికూటేశ్వరా!

221. వృషభారూఢుఁడు, సింహవాహినియు, విద్వేషంబులాలేవు, ని
ర్విషయానందుఁడు, విశ్వమాతయుశుభశ్రీవర్ధిలన్‌జూచుచే
విషమంబుల్ గనరట్టి దంపతులకేభేదంబులే, దాగజా
స్య షడాస్యుల్ సుతు లద్భుతంపు, గృహమయ్యా! శ్రీత్రికూటేశ్వరా!

222. కనగానంతట నీవె, కన్ను మొగుడంగా నీవె, నాముందు వె
న్కను నీవే; కుడి పక్క, నీ వెడమ పక్కన్ నీవె, యన్నింటనీ
యునికిన్ గంటిజగంబులన్ దిరముగానున్నట్టి నీవెందు ది
క్కని నేనమ్మితి, మ్రొక్కితిన్ మదినివేడ్కన్; శ్రీత్రికూటేశ్వరా!

223. శరణంచున్ నినువేఁడు చంద్రుని దయాస్వాంతుండవైప్రోచి,నీ
శిరమందున్ వెలుఁగొందఁ దాల్చితివి సుశ్రీయుక్తునిన్ జేయుచున్;
వరముల్‌గూర్చి యనుగ్రహింపఁగలదైవంబంచునిన్నెంతు రా
దరమేపారఁగ నన్నుఁగావుము; సమాత్మా! శ్రీత్రికూటేశ్వరా!

224. నుదుటన్ గన్నుఁగలట్టి నిన్ను వినుతింతున్ జ్ఞానమున్ గూర్ప, ఁబ్ర
ల్లదులన్ దోలఁగఁజేతఁబూనిన త్రిశూలంబున్ బ్రసారింపఁగో
రెద; నన్గావఁగ వేడెదన్; వితత కీర్తీ! దక్షిణామూర్తి! నె
మ్మది నీవాఁడనుగాఁగఁజూడుమిదె ప్రేమన్; శ్రీత్రికూటేశ్వరా!

225. చరమున్ స్థావరమైన విశ్వము సమస్తంబాత్మ సంపత్తియై
వరలున్ నీకుఁ; దదంతరంబునఁగడున్ భద్రంబుగానుందు మీ
శ్వర! సొమ్మొక్కరిదైన సోకొకరిదైవర్తింప న్యాయంబె? త
త్త్వరహస్యంబెఱుగంగ గర్వపడరాత్మన్; శ్రీత్రికూటేశ్వరా!

226. దురహంకారుల దుర్జనత్వమునకున్ దూరంబుఁగానుండు ని
బ్బరమున్, నిత్యము సత్య ధర్మవిధులన్ బాటించు నిష్ఠన్, మనో
హరమౌ మాటయు, బాటయున్ గృతుల నిన్నర్చించు భాగ్యంబునా
కిరవొందన్ గరుణింపు మెప్పుడు, పురారీ! శ్రీత్రికూటేశ్వరా!

227. త్రిపురంబుల్ హరియించు వాఁడనెడు కీర్తిన్‌గాంచునిన్నెంచు, భ
క్తపరాధీనుఁడవంచులోకములు; "సూక్ష్మంబందు మోక్షంబు" (నీ) గాఁ
గృప దేహత్రయముల్ హరించి, యనువర్తిన్ గావవేనన్ను, ని
క్కపుఁదెల్విన్ సకలాఘముల్ తొలఁగిపోఁగా; శ్రీత్రికూటేశ్వరా!

**228.** ప్రకృతిన్ బుట్టిన జీవులాప్రకృతి ధర్మంబూని పాటింప, నే
వికృతుల్ లేక పురోగమింతు, రమితావేశంబుతోఁదన్నిరో
ధకులై వర్తిలు వారికిన్ గలుగు నుత్పాతంబు లేనాఁడు ధా
ర్మికులైయుండుటమేలు; లోక హితవర్తీ । శ్రీత్రికూటేశ్వరా!

**229.** బ్రతుకున్ సర్వము, దేశభాషలకు, శాస్త్రజ్ఞాన సంపత్తి కం
కితమున్ జేసి, సమాజసేవలనురక్తిన్ గూర్చునాదర్శ జీ
వితముల్ జాతికి మాననీయములు దీప్తిన్,స్ఫూర్తి కేంద్రంబులై;
సతతంబామహనీయులన్ దలఁతు నీశా। శ్రీత్రికూటేశ్వరా!

**230.** చిరకాలం బొనరించు మేలితపముల్ సిద్ధించి, ప్రేమానురా
గ రసాంభోనిధులైన దంపతులనంగా ఁగీర్తి నార్జించి రం
దర కాదర్శము మీరు; మిమ్మొదను సంధానించినన్ గల్గు న
క్షరమౌధర్మము,నర్ధకామములు,మోక్షంబున్; ద్రికూటేశ్వరా!

**231.** కలవానిన్ నిరసించు, లేనివెవియో కాంక్షించు మాయా స్వభా
వుల చిత్తంబులు చంచలంబు, లనయంబున్ సత్యదూరంబులౌ,
గలలన్ దేలుచుఁ, గల్లలన్ బ్రతుకుచున్, గాలంబువెచ్చించుమూ
ర్ఖులకున్ జక్కని బుద్ధిఁజెప్పవెవిధిజ్ఞుల్గా; త్రికూటేశ్వరా!

**232.** నీకళ్యాణగుణంబులన్ వినుచు, ధ్యానింపన్ బ్రయత్నించుచున్
లోకంబెల్లను నీస్వరూపముగ నాలోకించి, సేవించినన్
నీకారుణ్యవిలోకనంబులును, సాన్నిధ్యంబుఁగల్పింతు; వా
ద్యా! కీలింపుము నాకు నీదు పదమాస్థన్; శ్రీత్రికూటేశ్వరా!

**233.** దేశంబెల్లలుఁగాలమున్ దిశలు నిర్దేశింపఁగాలేని ని,
న్నీశానున్దలపోయు నన్నుఁ దయతో నీక్షించి, సంసారదు
ష్క్లేశంబుల్ హరియించి, నీచరణ భక్తిశ్రీ ప్రసాదించి, భ
వ్యాశల్ దీర్చి ప్రశాంతి నీయవె; యమేయా! శ్రీత్రికూటేశ్వరా!

**234.** తమలోఁదాము విరించి విష్ణువులు ప్రాధాన్యంబురూపింప వా
దము పూనన్ గని, లింగమూర్తివయి మధ్యన్ నిల్చు నీ మూర్తి కం
తము నారంభమెఱుంగఁజాలక జగన్నాథున్ మహోదారు వి
క్రమసారున్ నిను గోరరే శరణు రుద్రా(వారల్)! శ్రీత్రికూటేశ్వరా!

**235.** కలికాలంబొ, విదేశ సంస్కృతియొ, సంస్కారంబొ లోకేశ। భ
ర్తలు, భార్యామణు లాత్మధర్మముల నిర్వర్తింపఁగాఁబోవ కా
శలఁదోగాడుచుఁ దృప్తిలేక వికృత స్వాంతంబుతో నెల్లఁబ్రొ
ద్దులు చెల్లింతురుగాని, మిమ్ముఁగనరంధుల్; శ్రీ త్రికూటేశ్వరా!

**236.** క్షణమానంద మనంతర క్షణము దుఃఖం, బంత శాంతంబుఁ దత్
క్షణమున్ వీరముఁబ్రేమమున్ గరుణ మాశ్చర్యంబు నట్లే క్షణ
క్షణమున్ రౌద్ర భయానకంబులును, హాస్యం, బింక భీభత్సమున్
గణుతింపన్బడు లోక నాటక సమీక్షన్, శ్రీత్రికూటేశ్వరా!

**237.** శివలింగంబున వ్రాలు తేలు పగిదిన్ శిక్షింప, రక్షింప, గా
క వెతల్ గూర్చు ఖలుల్ విషంబుఁదొలగంగాఁజేసి మమ్మోమవో
భువనాధీశ్వర। సంశ్రితావన కళాపూర్ణుండవౌ నీవు శా
త్రవులన్ ద్రుంపఁబినాకమెక్కిడవౌ? రుద్రా! శ్రీత్రికూటేశ్వరా!

**238.** కావ్యాలాప వినోదమాత్మకు సుసంస్కారంబుఁగల్పించుచున్
దివ్యంబౌషధమై విశోధనల నాధివ్యాధులన్ మాన్పు, దో
షవ్యాప్తిన్ విరమింపఁజేయు, నమితోత్సాహంబు సంధించు, బా
ధావ్యావృత్తి, నొసంగు హాయి; భవవైద్యా। శ్రీత్రికూటేశ్వరా!

**239.** నిరవద్యుండవు, నిత్యబుద్ధుఁడవు, నీ నిర్నిద్ర భావంబు నే
నరయన్జాలక సుప్రభాతమని, శయ్యాస్తోత్రపాఠంబు లం
చు రచింపన్దొరకొందు ఁబామరుఁడ, దాసున్ నన్ను మన్నించి, నీ
చరణంబున్ గొలువన్ వరంబిడుమునిచ్చల్; శ్రీత్రికూటేశ్వరా!

240. కలదే నీ స్థితి లేనిచోటు? వెదుకంగాఁజాల నీ చూపుతో,
నిలలో నీవిల; వగ్ని నగ్నివి; జలంబీవే జలంబందు; వ
ర్తిలు దాగాలిని గాలివై; గగనమూర్తిన్ బొల్తు వఖ్రాన, జ్ఞా
నులు చూడంగలరిన్ని; నే నెటు భజింతున్ శ్రీత్రికూటేశ్వరా!

241. ప్రకృతిన్ గల్గిన లక్షణంబు వికృతిన్ బ్రత్యక్షమౌ విశ్వక
ర్తకు విశ్వంబును బోలె; జ్ఞాన పరిపూర్ణంబైన బ్రహ్మంబెఱుం
గక, భేదంబు గణింతురజ్ఞులు! ననేకత్వంబు నందైక్య బో
ధక మాధ్యాత్మిక విద్య; స్వానుభవవేద్యా! శ్రీత్రికూటేశ్వరా!

242. ఒక చైతన్యమనంతలోకముల నుద్యోతింపఁగాజేయు దీ
ప కలాపోజ్జ్వలమై విమోహతమమున్, భ్రాంతిన్, నివారించుచున్
సకలాధారము జ్ఞానరూప మఖిలాశాపూర్ణతేజమ్ముగాఁ
బ్రకటింపంబడు; నద్దినీవనును, శాస్త్రం, బో్త్రికూటేశ్వరా!

243. అలలాగన్ జలకంబులాడుటకు నయ్యంభోధి తీరంబునన్
గలకాలంబునిరీక్షఁజేయుకరణిన్ గర్మానురక్తిన్బ్రవ
ర్తిలు చాధ్యాత్మిక జీవనంబెనయ సందేహించు చేనాఁడు భీ
తిలువారల్ నినుఁజేరుటెన్నడు ప్రపత్తిన్; శ్రీత్రికూటేశ్వరా!

244. కదలన్జాలని యీ జగంబుఁగదలన్గాఁజేయు చైతన్య మ
న్నది నీవౌదువు; నిన్నెఱుంగఁగల జ్ఞానంబున్నతంబన్నిటన్
చదువుల్ సంధ్యలు యాగయోగతపముల్ సర్వాత్మ నిన్జేర్చు, నీ
పదముల్ గొల్చుట పూర్వపుణ్యఫలమప్పా! శ్రీత్రికూటేశ్వరా!

245. భవబంధంబులఁజుట్టి కట్టి, పరతత్త్వంబందగానీక న
న్నవమానంబులపాలుచేసి, కనెదయ్యా చోద్య, మానంద ము
త్సవమున్ గూర్పవె భక్తసంతతి కనిష్టంబుల్ నివారించి, భై
రవ రూపంబున శత్రులన్దునుము చుగ్రా! శ్రీత్రికూటేశ్వరా!

246. ఆకాశంబునుబోలె నంతటఁబరివ్యాప్తంబు బ్రహ్మం, బనే
కాకారంబులఁదోచు, చన్నియునుదానై వెల్గుచున్ లోక మం
దేకత్వంబు ఘటింపఁజేయు, నది నీవేయంచు రూపించు, వి
ద్యాకల్పంబులు వేదవాక్యము లనంతా! శ్రీత్రికూటేశ్వరా!

247. శ్రుతులెల్లన్ "బరమేశ్వరుండవ"నుచున్ స్తోత్రంబుఁగావింప, సం
తతమున్ సర్వమునన్గనుంగొనుచు నిన్ధ్యానించు ధన్యుల్, సము
న్నతి సాధించుదు రాత్మతత్త్వమనుసంధానించుచున్ సాధుసం
గతి, ముక్తేశ్వర! నీయనుగ్రహము కల్గన్; శ్రీత్రికూటేశ్వరా!

248. ప్రాధాన్యస్థితి జీవనంబును సుసంపన్నంబుఁగావింప స
ర్వాధారంబగు భూమి, నీరు, ననలం, బావాయు, వాకాశమున్
శోధింపన్; బరమోపకార పథమున్ సూచించుచున్ నీకృపన్
బోధించున్, జగదేకనాథ! సతతంబున్; శ్రీత్రికూటేశ్వరా!

249. కరుణానీరధి! నీకృపాకణము సోకన్హాయిచేకూరు, దు
ర్భరతాపంబులడంగుచున్ బరవశత్వంబబ్బు, చింతాపరం
పరదూరంబగు, నృత్య, గీత కవితల్ స్వాంతంబు నన్బొంగు, దు
స్తర గంభీరము నీస్వభావము సదార్ద్రా! శ్రీత్రికూటేశ్వరా!

250. నీనామంబు జపించుచున్ సకలమున్ నీరూపుగానెంచుచున్
నీనాభేదమడంగు మార్గమెదనన్వేషించుచున్ జ్ఞాని, ధ్యా
నానూనస్థితిగాంచుచున్ బ్రకృతి, బ్రహ్మంబున్ విభాగించుచున్
తానే నీవను సత్యమున్ దెలియు శాన్తా! శ్రీత్రికూటేశ్వరా!

251. కరుణామూర్తివి, చంద్రశేఖరుఁడవేకాలంబులోకంబుల
బ్బురమందన్, బరమోపకారమతివైపూజ్యుండవైనాఁడ వో!
పరమేశా! శరణాగతార్తిహరుఁడాపద్బాంధవుండైన స
ద్గురు చందాన ననుగ్రహింతువని విందున్; శ్రీత్రికూటేశ్వరా!

252. కవితల్ వ్రాయుట కాలయాపనకు మార్గంబంచు నిందించుటె
క్కువగానున్న సమాజమిద్ది',యవివేకుల్ద్వేషభావంబుతో
డ విమర్శింతురుపద్యవిద్య', నినువేడ్కన్బాడcగా శక్తి నీ
యవె, ఛందస్సొకశాస్త్రమాదరణయోగ్యంబౌcద్రికూటేశ్వరా!

253. ధ్యేయంబెప్పుడు నీదురూపమనుసంధింపన్ బరబ్రహ్మమున్!
గేయంబల్ల సహస్రనామ మనురక్తిన్; భుక్తి ముక్తిప్రదం
బాయుర్వర్ధన,మిష్టసాధక ముపాస్యం బవ్యయానందమున్
సాయుజ్యంబునొసంగు నీ భజన మీశా। శ్రీత్రికూటేశ్వరా।

254. వరముల్గూర్చి, భయంబుcదీర్చి మముcబ్రోవన్నేర్చునిన్గొల్తు! "cద్వ
చ్చరణంబుల్ సకలాఘముల్దొలcచి మోక్షంబిచ్చు" నంచున్ శ్రుతుల్
పరమోదాత్తవిధిన్ వచించు, cబరతత్వంబైన నిన్నేనుతిం
తురుబ్రహ్మాదిసురల్ మహర్షులఖిలాత్మున్! శ్రీత్రికూటేశ్వరా!

255. తల నీలాలిడి ప్రీతి cబుణ్యనదిలోcదానంబు cగావించి భ
క్తులు, టెంకాయ లరంటి పండ్లు సుమసందోహంబులున్ దెచ్చియం
జలి cగావించి మనంబులన్ గలుగు వాంఛల్ దెల్పిమ్రొక్కంగ, ని
చ్చలు cగారుణ్యముతోవరాలిడుదువీశా। శ్రీత్రికూటేశ్వరా।

256. భ్రమలన్ద్రోచి, భయంబుcదీర్చి, జయమైశ్వర్యంబుcజేకూర్చి, జ్ఞా
నము వైరాగ్యము నిచ్చు నీపదము, లానందామృతంబాను యో
గము cగల్పించు! దయాపయోధి! శ్రితరక్షా! నిత్యకైలాసవా
సము నాకిమ్ము భవమ్ము బంధమెడలన్! స్వామి! శ్రీత్రికూటేశ్వరా!

257. ఏ నీసంస్మరణంబునన్ గలుగు నెందేనిన్ జయంబున్ శుభం
బానీరూపము దివ్యమంగళము నాయందున్ బ్రవేశింపది
వ్యానందంబున నోలలాడుదును మోహావేశముల్ మాన్పుధ్యా
నానూనస్థితినిమ్ము నిత్యమనవద్యా! శ్రీత్రికూటేశ్వరా!

258. "దైవంబొక్కcడె" భిన్నరూపములcబ్రస్తావించి, వర్ణించి, రా
పై విప్రుల్, శ్రుతి ధర్మ సారమును సర్వస్వంబు బోధింపcగా;
భావజ్ఞుండవు, భక్త రక్షణ కళాభద్రుండ, వాలింపవో
నావిజ్ఞాపన మేవిధానమున నున్నన్ శ్రీత్రికూటేశ్వరా!

259. స్థిరమౌసంగతి నింద్రియంబులు ప్రవర్తింపన్ మనోవృత్తి సా
ధనమౌ కల్గు శుభాశుభంబులకుcజిత్తంబేవికారంబునం
దనినాcడెట్టి యఘంబులేదు! దయతో ధర్మంబుcబాటించు జీ
వనమున్, భక్తియుముక్తి నిమ్ము; హృతపాపా! శ్రీత్రికూటేశ్వరా!

260. శ్రీకల్యాణ గుణంబులన్ జగము రక్షింపన్ బ్రవర్తించు నీ
వాకారుణ్యమునన్ ననున్ దనుపవో? ఆలింపవోనామొఱల్
ప్రాకామ్యంబులొసంగి నీప్రజల సంబాళింపవో? కష్టముల్
పోకార్పన్, సమకూర్పవో వరశుభంబుల్! శ్రీత్రికూటేశ్వరా!

261. నిన్నున్ గూర్చిన యూహలే కవితలై నిండారు కావ్యంబు(లౌ) లై
నిన్నున్ జేసిన స్తోత్రముల్ ఫలములందించున్ బ్రసాదంబులై
నిన్నున్ గొల్చిన పుణ్యమే బ్రతుకుc బండించున్ బ్రమోదంబునై
నిన్నున్ మించిన దేది లేదెచటనేనిన్ శ్రీత్రికూటేశ్వరా!

262. "ఇదినే, నీసకలంబు నాది" యను వాcడెవ్వండు? దేహంబొ? ఈ
పది యౌనింద్రియ బృందమో? మనమొ?ఆపై బుద్ధియో? జీవు cడి
య్యది సర్వంబును 'నేను' గాcదలcచు మాయామోహితుండై! ప్రబో
ధ దశన్గూర్పవె జ్ఞానదృష్టి! విదితాత్మా! శ్రీత్రికూటేశ్వరా।

263. కవితాగంగ సువర్ణయుక్తి నభిషేకంబై విరాజిల్లెడున్
కవితాగంధము శీతలంబగుచు సౌఖ్యంబిచ్చు నీకెప్పుడున్
కవితాపుష్పమలంకృతిన్బొలుచు సౌగంధ్యంబుc జేకూర్చుచున్
కవితామాధ్వి నివేదనంబగురసజ్ఞా! శ్రీత్రికూటేశ్వరా!

264. ఉపకారంబొనరింప లోకమపకారోద్వృత్తి వర్తించు, న
క్క పటంబీ వెఱుగంగఁజాల వకలంకంబైన భావంబునన్:
విపరీతార్థముఁజెప్పి, నీక్రియలకున్ విఘ్నంబుఁగావించునీ
యపచారంబు సహింతువెట్లు? జితదైత్యా! శ్రీత్రికూటేశ్వరా!

265. కలదే స్వప్న సుషుప్తులన్ మనసు? నిక్కంబద్ది, జాగ్రత్స్థితిన్
దలపోయన్మొదలై, యనుక్షణము నిద్రంజెందు నందాఁక, నూ
హలవాహ్యాళి నొనర్చుచున్, స్మృతుల డాయన్ బాయఁగాఁజేయుఁజం
చల చిత్తంబు నిరోధమున్నెఱపు మీశా। శ్రీత్రికూటేశ్వరా!

266. జడతన్వీడుచు బ్రాణులన్ నరుఁడనైజన్మించి నే సద్గురున్
బడయన్జాలితి మంత్రదీక్షఁగొనఁగా భార్యాసమేతుండనై!
పొడమెన్ సంతతి, సంపదల్ గలిగె, సమ్మోదంబు నిండార నీ
యడుగుందమ్ములఁ గొల్తు ముక్తినిడుమయ్యా! శ్రీత్రికూటేశ్వరా!

267. నిను నీలోనఁగనుంగొనంగడఁగుచున్నిష్ఠాగరిష్ఠుఁడవై
కనులున్మూసి సమాధియోగమున సౌఖ్యంబందు చిద్రూపు నిన్
గని లోకంబు గ్రహించునే? పరమలక్ష్యంబైన యానందమున్
గన యత్నించునె? జ్ఞానమార్గ మెనయంగా! శ్రీత్రికూటేశ్వరా!

268. కన్నుల్ మూయుచుఁ బ్రాణముల్ నిలుపుచున్ గాయంబు బంధించుచున్
నిన్నే నెమ్మదినిల్పుచున్ జపతపోనిష్ఠన్ బ్రవర్తించుచున్
మన్నున్ మిన్ను నతిక్రమించిరి జగన్మాన్యుల్ మునిశ్రేష్ఠులా
తెన్నున్జూపవె, చేర్పవేదరిఁగపర్దీ! శ్రీత్రికూటేశ్వరా!

269. బరువుల్ కావవి, బాధ్యతల్! శ్రితజనవ్రాతంబుప్రీతిన్ గనన్
గరళంబున్ గళమందు, గంగఁదలపైగ్రాలంగ ముల్లోకముల్
పరమానందమునందఁ దద్గిరిజ సంభావింపవే మేనునన్బీ
సరిరా రెవ్వరు నీకు సత్కృప మహేశా। శ్రీత్రికూటేశ్వరా!

270. తలఁపన్జిత్రములోకవృత్తము! యథార్థంబున్ విచారింప కా
శలసౌధంబులు పెక్కుఁగూర్చునెలమిన్ సర్వంబు నుర్వింబడన్!
బలితంబైన పునాదియైనిలుచు నీపాదంబెదన్ నిల్పినన్
గలకాలంబు సమృద్ధమైపొలుచువేడ్కన్! శ్రీత్రికూటేశ్వరా!

271. కాలంబాఁగదు దేహమున్ నిలువదేకర్మంబులున్దోడు రా
వాలోకంబుల,ఁగన్నవారు నిటఁదోడైయున్నవారాత్మజుల్,
పాలింపందగువారు, పోషకులు విద్వన్మిత్రులున్ బంధువుల్
పోలంజాల రుదారు నిన్నుఁ బరమాప్తున్ శ్రీత్రికూటేశ్వరా!

272. పరులన్దోచి, ధనంబుదాచుదొరకున్ భాగ్యంబులెన్నున్నను
ర్వర సంపాదనకంతులేదు మనసే బంధంబు మోక్షంబుఁగూ
ర్చు; రమానాథ సమర్చితాంఘ్రియుగళా! స్తోత్రంబుఁగాదిద్ది, నీ
పరితోషమ్ముజగమ్మునేర్చునె? యదంభా! శ్రీత్రికూటేశ్వరా!

273. కాలంబెంతయు వేగవంతము లసత్కారుణ్యభూషా! మహా
కాలా! మొన్నటిదాకపెద్దల సమక్షంబందు నేపిన్ననై
ఏలా నేఁడిటు పెద్దనైతి? తృటిలో నెంతెంతమార్పో? తప
శ్శీలంబూని నినున్ భజింతుఁగరుణశ్రీ! శ్రీత్రికూటేశ్వరా!

274. తిరమైయొక్కఁడు ముందుగానడువధాత్రిన్ మార్గమైపొల్చుఁబ
ల్వురు నాత్రోవఁ జరింతురంతట; కృపాపూర్ణుండవై నీవె మున్
గరువంబొప్ప జగంబులన్ దనుపుచున్ గంగా ప్రవాహంబు లు
ర్వరఁబాఱింపవె సస్యసంపదఁ దలిర్పన్ శ్రీత్రికూటేశ్వరా!

275. ఇలలో నేయెడ నెన్నిదేవళము లేయేరీతి నిర్మింపనం
దలిదైవంబొకఁడై విరాజిలును నానారూప నామావళిన్
తలఁపన్ జీవులలోన మూలమగు చైతన్యంబు నొక్కండుఁగా
వెలుఁగున్ దేహములందె భేదములు కన్పించున్ ద్రికూటేశ్వరా!

276. మొఱలాలింపవొ? సత్కృపాభరణ! మమ్మున్ బ్రోవఁగాఁబూనవో
చెఱలన్ ద్రోసి రిపుల్ నిరాదరణ పాల్సేయంగ రక్షింపవో?
తతికాదో? శరణాగతార్తి హరణోద్యత్కీర్తి! నీకిట్టియే
మఱుపాటేల? యనుగ్రహింపవొ? మహాత్మా! శ్రీత్రికూటేశ్వరా!

277. భ్రమలన్‌బుట్టి, భ్రమంబులన్ దిరుగుచున్ బంధంబులన్ బట్టువ
డ్డ మృగప్రాయుఁడు జీవుఁ డెవ్విధి నఖండజ్ఞాన సంపన్నుఁడౌ?
నమరేంద్రాది సురల్, మహర్షులుఁ దపోధ్యానమ్ములందాత్మసం
తమసంబున్ వెడలింపఁజాలిరె? అనన్తా! శ్రీత్రికూటేశ్వరా!

278. స్థిరమౌస్వస్థతనిచ్చుచున్, బరమశాన్తిన్ గూర్చుచున్, ధర్మత
త్పరతన్‌గర్మము లాచరించుచుఁ బరబ్రహ్మమ్ము నిన్గొల్వఁగాఁ
గరమానందము; స్వస్వరూపమునెఱుంగన్ జ్ఞానమిప్పింపు,మీ
నరజన్మంబు కృతార్థతంబొరయ నన్నా! శ్రీత్రికూటేశ్వరా!

279. ప్రీతిన్ నిన్నుఁదలంప, నీమహిమ వర్ణింపన్ సమర్థంబె? యీ
వ్రాతల్ కోఁతలు? సత్యమూర్తి! బుధవర్గ స్ఫూర్తి! సత్కీర్తి! నా
నాతర్కంబులు, మంత్రతంత్రములు మానంబౌనె నిన్గానఁగాఁ
బూతాత్మున్ బరమాత్మ యోగిజనగమ్యున్! శ్రీత్రికూటేశ్వరా!

280. లోకక్షేమముఁగోరు సద్గురువు లాలోచించి, మేలెంచి, వా
ల్మీకి వ్యాసులు చెప్పనట్టిదెదియున్ లేదెందుఁ! దద్విద్యభూ
మ్యాకాశంబులు, విష్టపత్రయములున్ వ్యాపించు, సత్యమ్మునా
లోకింపన్ గల వారలాఋషులు! సుశ్లోకా! త్రికూటేశ్వరా!

281. నిలువన్ నీడ, నివేశన స్థలముఁ బండింపన్ బొలంబేనిసుం
తలభింపన్ గఱవీజనార్ణవమునన్ దాహంబెదన్ దీఱదూ
హలఁబైపైకెగురంగఁబూను ననయం బాపైన నీరౌను ది
క్కులఁబాఱన్ ఫలమేమి? సద్గురుని నిన్గొల్తున్ త్రికూటేశ్వరా!

282. వ్యసనంబుల్ గ్రసియించు జీవులను మోహావిష్టులన్‌జేసి, మా
నసమందున్ నినుఁజేర్చి కొల్చుజనులానందంబు తోనుందు రెం
దసమాన స్థితి, నుత్తమస్తుతుల, లోకాదర్శమై నీదయన్
బ్రసరింపన్ దగు నీప్రజాళిఁ గనుమార్యా! శ్రీత్రికూటేశ్వరా!

283. కలలున్ గల్లలు కావు, సత్యముగ సంకల్పించియత్నింప స
త్ఫలముల్ గోరుట తప్పుకాదు కృషియున్ బాగున్నచోనెన్నఁడున్
తలఁపంగావలె నాత్మశక్తిగతి;ఁబంతంబొప్పఁగా రావణుం
డల కైలాసమునెత్తి భంగపడె జ్ఞేయా! శ్రీత్రికూటేశ్వరా!

284. కాలంబేకవిధంబుఁగానెపుడు సాఁగన్ బోక, సర్వర్తు సౌ
ఖ్యాలన్ గూర్చును మండుటెండలును, వర్షాటోపమున్, శీతమున్,
గ్రాలన్ జేయుచు జీవులందు సుఖదు:ఖంబుల్ ప్రకల్పింపఁగాఁ
జాలున్; సర్వము నీస్వరూప మఖిలేశా! శ్రీత్రికూటేశ్వరా!

285. సకలారాధనసంప్రదాయములు నిన్ సర్వాత్మ రూపించుదీ
పిక, లధ్యాత్మ వివేక బోధకము, లేభేదంబులేనట్టి జ్ఞా
నకళాసాధకముల్, పరాత్మఁబరిపూర్ణబ్రహ్మమున్ దెల్పు జ్ఞా
పిక లానందనిధుల్; సుమేరుగిరిధన్వీ! శ్రీత్రికూటేశ్వరా!

286. మన బాంధవ్యము దగ్గఱై జగతి సంభావింపఁగానయ్యె! నీ
వును శ్రీమాతయు సర్వలోక పితరుల్; పూర్వార్జితంబైన పు
ణ్యనికాయంబున నీయనుంగుతనయుండై పుట్టితిన్ నిన్నుఁజే
రిన జీవుల్ కడుధన్యులౌదు,రనివర్తీ! శ్రీత్రికూటేశ్వరా!

287. నీవెందేనియుఁగొండ కోనల భవానిన్‌గూడి కొల్వుండఁగా
నావాసంబును గ్రాసమున్‌బడయకాయాసంబుతోభక్తులి
ష్టావాప్తిన్ గనఁజేరుచుందురనయం బాత్మస్థితున్‌నిన్నుసం
భావింపగల జ్ఞానమీయవె; దయాపాంగా! త్రికూటేశ్వరా!

288. నేనెన్నం డడుగంగరానిదెదియేనిన్ వేఁడినానో? మహా
త్మా! నీ కీయఁగరానిదేది కలదో? ధర్మార్థ కామంబులున్
మానింపన్దగుమోక్షమిత్తువనిసంభావింతురేపెద్ద లీ
మౌనంబున్ విడనాడి తోడుపడవో? మాన్యా! త్రికూటేశ్వరా!

289. నీనామస్మరణంబెయన్నమును పానీయంబు స్నానంబు నీ
ధ్యానంబే సకలార్థసిద్ధిదము! నిన్దర్శించుటేపుణ్యమా
త్మానందంబు! సమస్తలోకవినుతా! అవ్యాజకారుణ్యమూ
ర్తీ! నీదాసునిదాసు, నన్గనవొకోప్రేమన్? ద్రికూటేశ్వరా!

290. గతజన్మంబునఁజేయుపుణ్యమిటు లిక్కాలంబునన్బండి? నీ
స్మృతిమాధుర్యముఁజింతనామృతమువర్షింపన్ బ్రహర్షంబగున్
శ్రితమందారము నీపదంబెదఁబ్రతిష్ఠింతున్దపోనిష్ఠ స
ద్గతిఁగల్గింపుము; పాలితాఖిలభయార్తా! శ్రీత్రికూటేశ్వరా!

291. భవపాశంబు లెడల్చు జ్ఞానగరిమన్ వైరాగ్యమున్ గూర్చుచున్
శివసంకల్పమునిచ్చు శంకరుఁడ! మచ్చిత్తంబులోనిల్చిస
త్యవచస్సంపద ధర్మపాలన మహోత్సాహంబు,ఁజేకూర్పవే;
శివుఁడే శిక్షకుఁడాత్మరక్షకుఁ, డుపాస్తిన్; శ్రీత్రికూటేశ్వరా!

292. ఒకచోనుండఁగఁజిత్తమున్నిలుపలే, కున్మాదియై, కొమ్మకొ
మ్మకులంఘించి,గిరుల్ తరించి భయమౌమార్గంబులన్ జొచ్చి కో
తికినీడౌగతి, సంచరించుజన,మేతీర్థంబులన్మున్గి గు
ళ్ళకుఁదద్గోపురపాళికిన్జనుట; మేలా! శ్రీత్రికూటేశ్వరా!

293. సదయాపాంగములన్ గనుంగొనుచు, విశ్వాసంబుతో విశ్వమం
దెదిగన్నన్ నినుఁ గన్నభావనయె నా కిప్పింపుమెప్పట్టునన్
హృదయస్థానమె నీ నివాసమని యోగీంద్రుల్ ప్రబోధించి, ర
య్యది నాకేర్పడఁజూపవే; ప్రణవవాచ్యా! శ్రీత్రికూటేశ్వరా!

294. శిష్టుల్ రక్షణపొందిరిందు నిను దర్శింపన్ బ్రసన్నుండవై
యిష్టంబుల్ సమకూర్తువీవనుచు నెంతేభక్తిసేవాపరుల్
కష్టంబుల్ పడి నీదుసన్నిధికిరాఁ గాపాడఁగాజూడుమీ
దుష్టుల్ చేయు కుతంత్రముల్దొలఁగ సద్రూపా! త్రికూటేశ్వరా!

295. పరులన్జూచి యసూయతోమెలఁగు నల్పజ్ఞుండు; వేదంబులన్
బరమార్థంబుగ్రహింపఁడన్నియును లోపంబంచు నిందించు నీ
వరమీప్రాణము, కీర్తి, సంపదలు సర్వంబౌట యోజింపలేఁ
డరయన్వేడెదవాని,జ్ఞానమిడి; దేవా! శ్రీత్రికూటేశ్వరా!

296. ఎవరేమన్ననునన్ను, నెమ్మదిని నిన్నేనమ్మి సేవింతు, త్రా
తవు, సర్వార్థఫలప్రదాతవు, లసత్కల్యాణ సంధాతవా
త్మవివేకస్థితిహేతుభూతుఁడవు సత్యజ్ఞాన సంపద్విధా
తవు నీవేయని; సర్వదు:ఖపరిహర్తా! శ్రీత్రికూటేశ్వరా!

297. ఎవరిన్ వేడుదునిన్నుఁగాక! మఱియింకెవ్వార లోదార్పుని
చ్చువలంతుల్; భువనైకనాయక! బుధస్తోత్రైకపాత్రా! కృపా
లవమున్జూపవె, దీనునిన్ మనుపవే, గ్లానిన్ నివారింపవే
భవతాపజ్వరహారి! సూరిజనసేవ్యా! శ్రీత్రికూటేశ్వరా!

298. పరులన్ వ్రేలిడిచూపువారు, తమ లోపంబుల్విలోకింపఁబో
వరు, సర్వేంద్రియముల్బహిర్గతములైవర్తిల్లుటంజేసి, లో
నరయన్ సత్యము గోచరంబగుచు, బ్రహ్మోభిన్నమీలోకమ
న్నరహస్యంబనుభూతమౌ, బుధనిధానా! శ్రీత్రికూటేశ్వరా!

299. కనులారన్గనుగొన్న నీజగములన్ గన్పట్టు నీరూప, మా
కనులన్ మూసిన దర్శనంబిడు భవత్కల్యాణ తేజంబు, నా
కనయంబున్ నినుఁజేరికొల్చుకొను భాగ్యంబిమ్ము; మోహమ్ముఁద్రుం
చి నివారింపుమునెమ్మదిన్గలుషరాశిన్! శ్రీత్రికూటేశ్వరా!

**300.** ప్రాణంబే ప్రణవంబు, తత్ప్రణవమే రాజిల్లు నీ రూప(తేజ) మీ
ప్రాణుల్ నీప్రతిరూపులౌదురు, మహత్ప్రాణంబు నీవౌచు సం
త్రాణంబున్ బొనరింతువీజగముఁజైతన్యంబుగాఁజేయుచున్
వాణీవల్లభదుర్లభా! త్రిభువనవ్యాప్తా! త్రికూటేశ్వరా!

**301.** త్రిశతిన్ వ్రాయుతలంపుతోడఁబ్రతిభన్ దీపింపగాఁజేసి,స
త్యశివజ్ఞానమొసంగి, సత్కృతుల నాదర్శంబుగానిల్పి, యీ
దృశసేవావిభవంబుఁ గూర్చు నినుఁబ్రార్థింతున్ విముక్తిన్ గనన్;
భృశమానందమున్యాసమౌనిధి సమర్పింపన్; ద్రికూటేశ్వరా!

**302.** ఒకనాఁడీముడివీడియేగుటెఱుగం,"దూరంచుఁ బేరంచు"ఁబూ
నికఁదానిచ్చులుప్రాకులాఁడు ఘనుఁడేనిన్ పుణ్యపాపంబు లొ
ద్దికఁగావించిన తావులందుఁదిరుగున్ దేహంబుగేహంబు భౌ
తిక సంబంధముబంధమున్గడచి ధాత్రిన్! శ్రీత్రికూటేశ్వరా!

**303.** ఏరూపంబులనెట్టిదేహముల నాకెన్నెన్నిజన్మంబులే
పారన్గల్గె సుఖంబుదుఃఖమునుసంప్రాప్తంబుగామున్ను, నా
నోరారన్ నుతియించుచీభవమునందున్ నిన్నెపూజింతునా
ప్రారబ్ధంబెడలింపవేడుచు; నఘోరా! శ్రీత్రికూటేశ్వరా!

**304.** నిన్నేనమ్మితి నాత్మ"విశ్వపతిగా", నీబిడ్డగా నెంచుమో
యన్నా! సన్నుతిఁజేయనో, పదములన్ధ్యానింపనోయోగసం
పన్నున్నిన్నుభజింపనో, సకలమున్బ్రహ్మమ్ముగాఁజూడనో
నన్నున్గావఁగవేడనోమది, మహాంతా! శ్రీత్రికూటేశ్వరా!

**305.** పదముల్గూరిచి(చేరిచి) పద్యమాలలు ఘటింపన్జూచు నాయత్నమున్!
ముదమారన్గని నాకుతోడగుచు సంపూర్ణంబుఁగావించి నీ
యెదపైగ్రాలఁగఁదాల్చి నీకరుణనెంతేఁజాటినావింక నీ
పదముల్ నా(హృదయంబునన్ నిలుపు)శిరమందునిల్పుమిదె సాంబా! శ్రీత్రికూటేశ్వరా!